## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016736

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

# దుర్గామల్లేశ్వర శతకము



గ్రంథకర్త:

చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు.




ప్రకటనకర్తలు:

బెజవాడ దుర్గాపురములో వేంచేసియున్న

శ్రీ దుర్గామల్లేశ్వర ప్రముఖ దేవాలయ సంస్థాపకులు

1. (పు[illegible] కోటయ్యగారి భార్య) పోషిత కనకదుర్గాంబ

2. బేత హ[illegible] [illegible]ర భయ్యా

మూల్యము

# విజ్ఞప్తి

పాఠక మహాశయులారా!

ఉభయ వాఙ్మయమందును గద్య పద్యాత్మకములయిన ప్రబంధముల కంటెను, చెవులకును కనులకును బండువొనరింపఁ జాలిన "దృశ్య ప్రబంధాదుల కంటెను" నాటకములు కవియొక్క ప్రతిభా విశేషమును, స్వాతంత్ర్యమును, భగవద్భక్తిని, లోకజ్ఞత్వమును బ్రస్ఫుటముగాఁ దెలియఁజేయును. కావుననే నాటకరచనకు దొడంగితిని.

నేనొక సమయమున దుగ్గామల్లేశ్వరాలయము దుర్గాపురమునం దపూర్వముగా నిర్మింపఁబడి యున్నదని విని, తద్దర్శనార్థము చని సందర్శించితిని. వెంటనే "దుగ్గామల్లేశ్వర!" యను మకుటముతోఁ గొన్ని పద్యములు దుగ్గామల్లేశ్వరులు రచియింపఁజేసిరి. వానిని తదాలయ ధర్మకర్తలందు, వేత పూడి వీరశరభయ్యగారు విని, భగవత్ప్రేమమునకుఁ గడుఁగడు సంతసపడి నాటకముగా రచియింపుఁడని ప్రేరేచిరి. తరువాత గతవత్సర దేవీ శరన్నవరాత్రోత్సవములందు విద్వాంసుల సభామధ్యమున విని పదవిభాగ ప్రతి పదార్థ తాత్పర్యములను గూడ వ్రాయుఁడని కోరిరి. నాకు మిక్కిలి సంతసము కలిగి యట్లే వ్రాసి యిచ్చితిని. వారును ముద్రింపించిరి. సంగీత సాహిత్య కవిత్వాది కళలను పూర్వ సంస్థానాధిపతులట్లు నానాటి కభివృద్ధిఁ జేయుచున్న, పోషిత కనకదుర్గాంబగారిని శ్రీ వీరశరభయ్య గారిని దుర్గామల్లేశ్వరులు దీర్ఘాయువులు గల వారినిగా నొనర్తురుగాత.

పొన్నూరు
21—4—47

ఇట్లు,
గ్రంథకర్త.

# "పండితాభిప్రాయము"

## శ్రీ దుర్గామల్లేశ్వర శతకము

ప్రాచీన ధర్మములు బోధించుటలో నేమి, నూతన భావములం బ్రోత్సహించుటలో నేమి, మిక్కిలి ప్రశంసనీయమై యున్నది. ఇది స్థలప్రసక్తిని వెలకొల్పుచున్న యది. త్యాగరాజుయొక్క భక్తి ప్రపత్తిని సమంజసముగా వర్ణించెను. శ్రీ రామచంద్రమూర్తి, శ్రీ హనుమంతుడు, గాయత్రి మొదలగు దేవతలయొక్క ప్రాముఖ్యమును చక్కగా చేర్కొనెను. గోమాణిక్యముల యొక్కయు, నక్షత్రముల యొక్కయు వర్ణనము ప్రమోదావహమై యున్నది. మంత్రతత్త్వము మనోహర భావములతో విశదీకరింపబడెను "భూమండలక్కడ నగ్నియక్కడ" మొదలగు సూక్తులచే బహు సులభపద్ధతిని న్యాయభావము విస్తరింపబడినది.

దేశస్థానములు, ధర్మకర్తలు, భక్తులు, ప్రజలు, సేవకులు, మొదలగు వారల స్వభావములను విపులముగా జర్చించెను. దీనియందు సంపాదనయొక్క యావశ్యకతయును, సరియగు వినియోగమును బాగుగా సమర్థింపబడినది. దేవతలకును మానవులకును బాహ్య సమాన ధర్మము సయుక్తికముగా స్థిరీకరింపబడినది. ఈశ్వరునకును శక్తికిని, ఇంద్రియనిగ్రహకిని సన్యాసానుకూల్యము ప్రజల నవనవరీతిని సముద్భవించుతీరులు బాగుగా నిరూపింపబడినవి. ఇది ఛందస్సునందు మంచి స్థానమందినది. దీని మకుటము "దుర్గామల్లేశ్వరా! సర్వదేవ పరివారా! హ్రీంహీరాకృతీ!" అనియున్నది. ప్రతిపద్యము నందును నిల్చుండుటచే నియతిస్థానమున "ర్గా" అను వర్ణమును, ప్రాసస్థానమున "మ" అను వర్ణమును ననగణముగా వచ్చుచుండుట మిక్కిలి సమంజసము. ఈ నియమము స్వాభావికములగు పదములతో సముచ్ఛ్రయించి నైసర్గికమును సంద్ఘోషించుచున్నయవి. ఈ యది పూర్వశతకముల బోలి ధర్మవులను; గోత్రశతకముల వలె నియమముల నెదగల్పుచున్నయది. సంస్కృతపద భూయిష్ఠమైనను తేటతెనుగువలె మిక్కిలి రుచిని ఆసక్తిని కలిగించుచున్నది. వేదములలోనివియు, శాస్త్రములలోనివియు బహు విషయములు మిక్కిలి తేటతెల్లముగ విశదీకరింపబడినవి. దుర్గామల్లేశ్వరులు ధర్మకర్తలను గ్రంథకర్తలను భక్తులను బాలికలను బాలురను సేవకులను సర్వకాలము పరిరక్షించుచుందురుగావుత.

విద్వాన్ శతావధాని, భమిడిపాటి అయ్యప్పశాస్త్రి.

# విషయసూచిక




1. పరివార దేవతలు
2. చతుర్వేదములు
3. షట్శాస్త్రములు
4. ధర్మకర్తృ ప్రశంస
5. గో ప్రశంస
6. అరి షడ్వర్గము
7. పురుషార్థములు
8. లోకోపదేశము
9. అఖండ సమాసములు
10. శతక సమర్పణము

శ్రీ శివాయ గురవేనమః

# శ్రీ దుర్గామల్లేశ్వర శతకము

శా॥ శ్రీమంతంబగు నీమహామహిమ వర్ధిష్ణుత్వమొక్కొక్కచో
శ్రీమంతుం బొనరించె నొక్కొకని మున్ శ్రేయస్స్వరూపమ్మునన్
స్వామీ! నేఁడటె "కోటవీరశరభ ప్రజ్ఞాబ్ధులన్" బేర్మి దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా ! హారహీరాకృతీ!

౧ ప॥ శ్రీమంతము-అగు నీ మహామహిమ వర్ధిష్ణుత్వము-ఒక్కొక్క చోన్ - శ్రీమంతున్ - పొనరించెన్ - ఒక్కొకనిన్ - మున్ - శ్రేయస్స్వరూపమ్మునన్ - స్వామీ! - నేఁడు - అటు - ఎ - కోట వీరశరభ ప్రజ్ఞాబ్ధులన్ - పేర్మిన్ - దుర్గా! మల్లేశ్వర! - సర్వ దేవపరివారా! - హారహీరాకృతీ!-

ప్రతి॥ దుర్గా=కష్టపడి తెలుసుకొఁదగినతల్లీ; మల్లేశ్వర=మల్లులరూపము ధరించిన రాక్షసుల సంహరించిన జగత్ప్రభూ! సర్వదేవ పరివారా! = వినాయక సుబ్రహ్మణ్యేశ్వర గాయత్రి సీతారామలక్ష్మణ హనుమదాది సకల దేవతలతోఁ గూడియుండు మహాదేవా! హారహీరాకృతీ; హార = నవరత్న మాలికయందు, హీరాకృతీ= నాయకమణియైన వజ్రమట్లు, సర్వజీవుల హృదయముల లోపలఁ బ్రధానులై ప్రకాశించు తల్లిదండ్రులారా! వినుడు.

శ్రీమంతము = సంపదలకు ప్రకాశమునకు స్థానము = అగు నీ మహామహిమ వర్ధిష్ణుత్వము = అగు = నీయొప్పు = నీమహామహిమ = నీయొక్క గొప్పమహిమయొక్క = వర్ధిష్ణుత్వము = వృద్ధియగు స్వభావము = మున్ = పూర్వము=ఒక్కొక్కచోన్ = ఒకానొకస్థల విశేషమునందు = ఒక్కొకనిన్ = ఒకానొకపురుషుని = శ్రేయస్స్వరూపమ్మునన్ = శ్రేయః = మోక్షమనే=స్వ = ధనము రూపమ్మునన్ = కలుగుటయందు=శ్రీమంతున్ అదృష్టము కలవానినిగాన్ = పొనరించెన్ = చేసెను = స్వామీ = ఓ! సర్వేశ్వరా! నేఁడు = ఇప్పుడు = అటె = ఆవిధముగానే = కోటవీరశరభ ప్రజ్ఞాబ్ధులన్ = పుచ్చాకోటయ్య బేతపూడి వీరశరభయ్య యను ధీనిధులను పేర్మిన్ = వత్సలత్వముచే = పొనరించెన్=చేసెను.

దుర్గా! మల్లేశ్వర!

లోకములకు సంపదలను కలిగించుచు వృద్ధిజెందు స్వభావము గల నీమహిమ యొక్కొకసమయమున నొక్కొకని నుద్ధరించును. అట్లే నేడును "బెజవాడ" దుర్గాపురమునందు పుచ్చాకోటయ్య, చేతపూడి వీరశరభయ్య యను భక్తులను నిజకరుణాసదనమునకు పాత్రులనుగా నొనర్చితిరి.

శా. శ్రీమించు ల్గల నీపురి న్నలుగడఁ జేబూని ఖడ్గంబరి
స్తోమమ్ము న్విదళించి భైరవ తను జ్యోతుల్ప్రదీపింపఁగా
యామమ్ముల్కని పెట్టు దిస్సమొలదివ్యక్షేత్రపాలుండు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ శ్రీమించుల్ - కలనీపురిఁ - నలుగడఁ - చే - పూని - ఖడ్గంబు - అరిస్తోమముఁ - విదళించి - భైరవతను జ్యోతుల్ - ప్రదీపింపఁ - గాఁ - యామమ్ముల్ - కనిపెట్టుఁ - దిస్సమొల దివ్యక్షేత్రపాలుండు.

శ్రీమించుల్ = శుభములను తెలుపులుకులు కులు = కలనీపురిఁ = ఉన్నట్టి దుర్గాపురమందు = ఖడ్గంబు = కత్తిని = చే = హస్తమందు = పూని = ధరించి నలుగడఁ = నాలుగువైపుల = అరిస్తోమంబుఁ = అరి శత్రువుల యొక్క = స్తోమంబుఁ = సమూహమును = విదళించుచు = చీల్చి చెండాడుచు = భైరవతనుజ్యోతుల్ = భైరవ=భయంకరమయిన = తను= శరీరముయొక్క = జ్యోతుల్ = కాంతులు = ప్రదీపింపగాఁ = ప్రకాశించుచుండగా = దిస్సమొలదివ్యక్షేత్ర పాలుండు = దిగంబరుఁడయిన క్షేత్రపాలకుఁడు; యామంబుల్ = ఎనిమిదిజాములును = కనిపెట్టుఁ = కాపాడుచుండును.

దుర్గాపురమున నాలుగు గవనులను ఖడ్గము చేఁబూని యధర్మమార్గమున సంచరించు దుర్మార్గులను ఖండించుచు తన శరీరకాంతులు రాత్రులందు దీపమువలెఁ బ్రకాశింప క్షేత్రపాలకుఁ డు దిగంబరుడై రేఁబవళ్లును మీ క్షేత్రమును కంటవత్తులు వైచుకొని కాపాడు చుండును.

శా॥ ఓమాకారము వక్రతుండమును దంతోద్భూత కాంతిచ్ఛటల్
మైమై తద్యమునా సరస్వతుల శుంభద్రేఖఁగాన్పింపఁ ద్వ
త్ప్రేమస్థానము "సిద్ధి బుద్ధిపతి సేవించున్గజాస్యుండు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ ఓమాకారము-వక్రతుండమును - దంతోద్భూత కాంతిచ్ఛటల్ - మై - మై - తద్యమునాసరస్వతుల శుంభద్రేఖన్-కాన్పింపన్ - త్వత్ప్రేమ స్థానము - సిద్ధిబుద్ధిపతి - సేవించున్ - గజాస్యుండు.

ఓం అకారము = ఓంకారము:వంకరదైన = వక్రతుండమును = వంకరయైన తొండమును = దంతోద్భూత కాంతిచ్ఛటల్ = దంతి = కొమ్ము నుండి = ఉద్భూత = పుట్టిన = కాంతి = ప్రకాశముయొక్క = చ్ఛటల్ సమూహములు = మైమై = ఒకదానితోనొక టికలసి = తద్య......రేఖన్ తత్ = ప్రసిద్ధమయిన = యమునా = యమునానదియొక్క = సరస్వతుల సరస్వతీనదియొక్క = శుంభత్ = ఒప్పిదమయిన = రేఖన్ = మాదిరిగా కాన్పింపన్ = గోచరింపఁ జేయుచుండఁగా = త్వత్ప్రేమస్థానము త్వత్ = నీయొక్క = ప్రేమ = గారామునకు = స్థానము = నివాసమైనవాడును= సిద్ధి బుద్ధి పతి = సిద్ధి దేవికి బుద్ధిదేవికి భర్తయైనవాడునగు గజాస్యుండు = వినాయకుఁడు = సేవించున్ = కొల్చుచుండును.

మీకు ముద్దుబిడ్డయైన విఘ్నేశ్వరుఁడు నల్లని వంకరతొండమునందు తెల్లనిదంతము యమునాప్రవాహమున సరస్వతీనది పాయవలెఁ బ్రకాశింప "సిద్ధి బుద్ధుల"ను నిర్వురుపత్నులును నుభయపార్శ్వములసేవింప, నిత్యమును మిమ్ము సేవించుచుండును.

శా॥ చామంతీ నవమల్లికాది సుమగుచ్ఛస్వచ్ఛసౌగంధ్య మి
మ్మౌమూర్తిం బ్రకటించుచుస్ సకలశాస్త్రామ్నాయసంధాతశో
భామధ్యందినభాస్కరుండెసఁగు సుబ్రహ్మణ్యుఁడౌఁజెంత దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

చామంతీ నవమల్లికాది సుమగుచ్ఛస్వచ్ఛ సౌగంధ్యము - ఇమ్మౌ - మూర్తిన్ - ప్రకటించుచున్ - సకలశాస్త్రామ్నాయసంధాత - శోభామధ్యందినభాస్కరుండు - ఎసఁగున్ - సుబ్రహ్మణ్యుఁడు - ఔన్ - చెంతన్ - దుర్గామల్లేశ్వర!

ప్ర॥ చామంతీ..............సౌగంధ్యము = చామంతీ = చేమంతి పూలు = నవమల్లికాది = అప్పుడు వికసించిన మల్లెపూవులు మొదలైన = సుమగుచ్ఛ = పూలగుత్తులయొక్క = స్వచ్ఛ = నిర్మలమయిన = సౌగంధ్యము = పరిమళమును = ఇమ్మౌ = ఇంపుగనము = ఔమూర్తిన్ = అయిన తనశరీరముచేత = ప్రకటించుచున్ = తెలియఁజేయుచు = సకల..............సంధాత = సకల = సమస్తమయిన = శాస్త్ర = శాస్త్రములను = ఆమ్నాయ = వేదములను = సంధాత = తన్నుపాసించెడు భక్తులకు సమకూర్చువాఁడును = శోభా..........భాస్కరుండు; శోభా = కాంతియందు = మధ్యందిన = మట్టమధ్యాహ్నమందైన = భాస్కరుండు = సూర్యునివంటి వాఁడయిన = సుబ్రహ్మణ్యుడు = వల్లీ సేనా సహితుఁడైన సుబ్రహ్మణ్యేశ్వరుఁడు = చెంతన్ నీసమీపమునందు = ఎసఁగున్ = ఒప్పును = ఔన్ = సత్యము...

వల్లీసేనాధిపతియగు సుబ్రహ్మణ్యేశ్వరుఁడును తానుకదలుసంతచేమంతి మల్లె, సంపెఁగ, గులాబి, మొగలి మొదలైన పుష్పముల పరిమళములు నలుదెసల వ్యాపింపఁగా నిజమహామహిమచే తన్నుపాసించు భక్తులకు శాస్త్రములయందు, వేదములయందు, సంపూర్ణ ప్రవేశము నిపుణత్వము ననుగ్రహించుచు మిట్టమధ్యాహ్నమునందు సూర్యమండలమువలె మీ సమీపమునందు ప్రకాశించుచుండును.

శా॥ ధీమాంద్యమ్ముఁదొలంచి సన్మకుట పంక్తిస్ఫీత ముక్తాఫల
శ్రీమద్విద్రుమ హేమనీలసితరోచిఃకాంతకాంతాస్యముల్
భూమానందమొసంగ నీదరిని పొల్పుంగూర్చుగాయత్రి దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ ధీమాంద్యమ్మున్ - తొలంచి - సన్మకుట పంక్తిస్ఫీతముక్తాఫలశ్రీ
మద్విద్రుమహేమనీలసితరోచిః కాంతకాంతాస్యముల్ భూమానందము-
ఒసంగన్ - నీదరిన్ - ఇ - పొల్పున్ - కూర్చున్ - గాయత్రి.

ధీమాంద్యమ్మున్ = ధీ = బుద్ధియొక్క - మాంద్యమ్మున్ = బండ
తనమును; తొలంచి = పోగొట్టి సన్మకుట.........కాంతాస్యముల్ =
సత్ = లెస్సయయిన; మకుట = కిరీటములయొక్క, పంక్తి = సమూహ
మందు - స్ఫీత = ఒప్పుచున్న=ముక్తాఫల = మంచిముత్యములయొక్క
శ్రీమత్ = నిగనిగలాడు; విద్రుమ = పగడములయొక్క, హేమ = బంగా
రముయొక్క నీల = ఇంద్రనీల మణులయొక్క, సిత = స్వచ్ఛమయిన,=
రోచిః = కాంతులచేత; కాంత = క్రమ్ముకొనఁబడిన, కాంత = సుంద
రములయిన, ఆస్యముల్ = ముఖములు, భూమానందము = భూమ = అధి
కమయిన, ఆనందము = సంతోషమును ఒసఁగన్ = కలిగించుచుండగా,
నీదరిన్=నీసమీపమందు, గాయత్రి = తన్ను గొనియాడువారలను రక్షించు
తల్లి; పొల్పున్ = అలంకారమును, కూర్చున్ = చేర్చుచుండును.

నిరంతరము తెంపులేని భక్తివిశేషముచే హృదయమను రత్నసౌధమ
నందు తన్ను నెలకొల్పి యుపాసించు భక్తులకు నిరులను గూర్పఁజాలి యెఱుపు,
పసుపు, నలుపు, తెలుపు రంగులు కల పగడములు. బంగారము, ఇంద్రనీల
మణులు, ముత్యములును కూర్చిన కిరీటములతోఁ బ్రకాశించు శిరస్సులతో
మహానంద మొసఁగుచు, బుద్ధిమాంద్యమును పోఁగొట్టి చుఱుకుఁదనము గలి
గించు గాయత్రీమాత మీసమీపమున విరాజిల్లుచుండును.

శా॥ మై మించుల్ గలవల్వ కైవిలు తలన్ భాస్వత్కిరీటంబు వీ
క్షామార్గమ్మును నిల్వ నీడయు భుజాస్కంధంబులొప్పన్ గుణ
గ్రామశ్రీనిధి రామచంద్రుఁడు శుభాకారుండునిన్గొల్చు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

మై - మించుల్ - కలవల్వ - విలు - తలన్ భాస్వత్కిరీటంబు- వీక్షామార్గమ్మున్ - ఉ - నిల్వన్ -నీడ - ఉ - భుజాస్కంధంబులు - ఒప్పన్ - గుణగ్రామ శ్రీనిధి - రామచంద్రుఁడు - శుభాకారుండు-నిన్ - కొల్చున్.

మై = శరీరమందు, మించుల్ = నిగనిగలు, కలవల్వ = ఒప్పుచున్న వస్త్రము, కై = చేతియందు, విలు = ధనుస్సు, తలన్ = శిరమునందు, భాస్వత్ కిరీటంబు = ప్రకాశించుచున్న కిరీటమును, వీక్షామార్గంబును = చూపులతోవను, నిల్వన్ = అప్పుచుండ, నీడ = తోడునీడయయిన సీతాదేవియు, భుజాస్కంధంబులు = బుజములట్లు సహాయముచేయు లక్ష్మణభరత శత్రుఘ్నులు, ఒప్పన్ = తనర్చుచుండుగా, గుణగ్రామశ్రీనిధి = గుణ = శౌర్య ధైర్య గాంభీర్యౌదార్యములు మొదలయిన సద్గుణములయొక్క. గ్రామ = సమూహముయొక్క, శ్రీ = లక్ష్మికి, నిధి = గనివంటివాఁడును, శుభాకారుఁడు = శుభ = మంగళప్రదమయిన, ఆకారుండు = ఆకారముకలవాఁడును నగు, రామచంద్రుడు = చంద్రునివలె నెల్లవారి కాహ్లాదము గలిగించు రామప్రభువును = నిన్ను, కొల్చున్ = సేవించును.

మేఘమువంటి శరీరమందు మెఱుఁగుదీఁగవలె కట్టు పుట్టమును; చేతియందు ధనస్సును. శిరమునందు రత్నకిరీటమును, కనులకు పండువొనర్పఁదన యంకమునందు సీతయు, నిరుప్రక్క అయందు లక్ష్మణ భరత శత్రుఘ్నులును సేవింప సమస్తకళ్యాణగుణములకు గనియైన శ్రీరామచంద్రుఁడు మిమ్ము నిరంతరము జపించుచుండును.

శా॥ హేమంబుంగురియించు మేనిసిరి హాయింగూర్చుచున్ సర్వదా
యామోదంబు ఘటింప రామవిభు నిత్యానందరూపంబు భా
మా ముంగొంగుపసిండి నిన్గొలుచు సంపద్వల్లిగోపుత్త్రి దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

హేమంబున్ - కురియించు మేనిసిరిన్ - హాయిన్ - కూర్చుచున్ సర్వదా - ఆమోదంబు - ఘటింపన్ - రామవిభు నిత్యానంద రూపంబు- భామాముంగొంగుపసిండి - నిన్ - కొలుచున్ - సంపద్వల్లి - గోపుత్త్రి.

హేమంబున్ = బంగారును, కురియించు మేనిసిరిన్ = వర్షించునట్టి శరీర కాంతిచే, హాయిన్ = చూచువారికన్నులకు సుఖమును కూర్చుచున్ = కలిగించుచు, సర్వదా = ఎల్లప్పుడు, ఆమోదమ్ము = సంతోషమును, ఘటింపన్ = కూర్చుచుండగా, రామవిభునిత్యానందరూపంబు, రామవిభు= ప్రాణనాథుడయిన శ్రీరామచంద్రునియొక్క. నిత్యానందరూపంబు నిత్య = ఎల్లప్పుడును తొలగక నిండియుండు, ఆనంద = అనుభవము యొక్క, రూపంబు=ఆకారమయినదియు, భామా............పసిండి = భా మా = కాంతికిని, మా = లక్ష్మికిని, ముంగొంగు = పయ్యెద చెఱగునందు, పసిండి = మూటకట్టిన బంగారమయినదియు; సంపద్వల్లి = సంపత్ = వివిధములయిన సంపదలకు, వల్లి = తీగవంటిదియు; గోపుత్త్రి = భూదేవి కుమారియైన సీతాదేవి, నిన్ = నిన్ను; కొల్చున్ = భజించుచుండును.

బంగారమునకు బంగారమైన తన శరీరచ్ఛాయ లోకములకు హాయి గూర్చ శ్రీరామచంద్రునకు కన్నులవలె హాయిగలిగించుచు స్త్రీలకు సమస్త సుఖములను కలిగించుటకు కారణమై భక్తుల గృహాంగణములందు సంపదలను పూఁదీఁగల నల్లిబిల్లిగానల్లుకొనఁజేయు భూపుత్త్రి మహాలక్ష్మీరూపాంతరము సీతాదేవి మిమ్ము సర్వదా సేవించుచుండును.

శా॥ భీమాకారపరాక్రమక్రమము జూపింపం గడుం జాలియుఁ
భూమిఁ మించినశాంతి జాలియును నెమ్మోమొత్తి తెల్పఁ రఘు
స్వామి స్వచ్ఛయశంబువెల్లగొడుగా సౌమిత్రినిన్గొల్చు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ భీమాకార పరాక్రమ క్రమముఁ - చూపింపఁ - కడుఁ - చాలి - యుఁ - భూమిఁ - మించినశాంతి - జాలి - యుఁ - ఈ - నెమ్మోము - ఒత్తి - తెల్పఁ - రఘుస్వామి స్వచ్ఛయశంబు - వెల్లగొడుగు - ఔ సౌమిత్రి - నిఁ - కొల్చుఁ - దుర్గా మల్లేశ్వర!

భీమా......క్రమముఁ = భీమ = భయంకరమయిన, ఆకార = శరీరముకల, పరాక్రమక్రమము = భుజబలమును = చూపింపఁ = ప్రదర్శించుటకు, కడుఁ = మిక్కిలి, చాలియుఁ = సమర్థుఁడయ్యును, భూమిఁ = భూదేవిని; మించినశాంతి = అతిశయించిన యోర్పు, జాలి = దీనులయందలి దయాగుణమును, నెమ్మోము = నిండైనముఖము, ఒత్తి = గట్టిగా. తెల్పఁ = తెలియఁజేయుచుండఁగా, రఘుస్వామి స్వచ్ఛయశంబు= రఘుస్వామి= శ్రీరామచంద్రునియొక్క, స్వచ్ఛ= నిర్మలమయిన, యశంబు కీర్తివంటివాఁడును. వెల్లగొడుగు = శ్వేతాతపత్రమువంటివాఁడును నగు సౌమిత్రి = సుమిత్ర కుమారుఁడయిన లక్ష్మణస్వామి, నిఁ = నిన్ను, కొల్చుఁ = నిత్యమును సేవించుచుండును.

శత్రువులకు భయంకరమయిన రూపము రణరంగమునందు మాత్రమే చూపించుచు, సర్వకాలము మిక్కిలి సహనముకలిగి బీదలయందు కనికరమును ప్రకటింపఁజేయుచు, శ్రీరామచంద్రునకు కీర్తివంటివాఁడును వెల్లగొడుగువంటివాఁడును నగు లక్ష్మణస్వామియు మిమ్ము ధ్యానించుచుండును.

శా॥ భూమీశాకృతి భ్రాతృభక్తి యువరూపుంగొన్న వైరాగ్యమౌ
రామప్రేమసుధాబ్ధి చంద్రముఁడు ధర్మప్రాణ మౌదార్య వి
ద్యామర్త్యత్వము యోగిరాడ్భరతుఁ డుద్యద్భక్తి నిన్గొల్చు దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా! హారహీరాకృతీ!

ప॥ భూమీశాకృతి- భ్రాతృభక్తి - యువరూపుఁ - గొన్న - వైరాగ్యము-ఔ-రామప్రేమసుధాబ్ధి చంద్రముఁడు-ధర్మప్రాణము -ఔదార్య విద్యామర్త్యత్వము-యోగిరాడ్భరతుఁడు-ఉద్యద్భక్తిన్ - నిన్- గొల్చున్-

భూమీశాకృతి = రాజరూపమును ధరించిన, భ్రాతృభక్తి = యన్నగారిని తండ్రికిమారుగా జూచుకొను భక్తియగువాడును, యువరూపున్ = చిన్నవాని రూపమును,కొన్న వైరాగ్యము=ధరించినవిరాగిభావమయినవాఁడును ఔరామప్రేమసుధాబ్ధి చంద్రముఁడు = ఔ = అయినటువంటి, రామ = శ్రీరామచంద్రునియొక్క, ప్రేమ = వాత్సల్యమను, సుధాబ్ధి = పాల సముద్రమునకు, చంద్రముఁడు = షోడశకళాపరిపూర్ణుడైన చంద్రునివంటి వాఁడును, ధర్మప్రాణము = ధర్మ=రాజధర్మమునకు; ప్రాణము = ప్రాణము వంటివాఁడును, ఔదార్యవిద్యామర్త్యత్వము = ఔదార్య = దానగుణము యొక్క; మర్త్యత్వము = మనుష్యరూపమైనవాఁడును నగు, యోగిరాడ్భరతుఁడు=యోగిరాజయిన భరతుఁడు,దశరథుని కుమారుఁడైన భరతుఁడు,నిన్ = నిన్ను= ఉద్యత్ = కలిగిన = భక్తిన్ = భక్తిచేత, గొల్చున్ = సేవించుచుండును.

భ్రాతృభక్తి రాజకుమారుడైనట్లు వైరాగ్యము యువకుని రూపము ధరించినట్లును త్యాగగుణము మనుష్యరూపము వహించినట్లును నెల్లవారికి తోచుచు ధర్మప్రాణము యోగియు శ్రీరాముని ప్రేమ యను పాలసముద్రమును చంద్రునివలె నుప్పొంగ జేయువాడునునగు భరతుఁడును మిమ్ము సేవించుచుండును.

శా॥ సీమస్థానమతిక్రమించువిషదోషిన్ వార్ధిరామక్రియన్
సీమస్థానమతిక్రమించువిషదోషిం దున్మి పేర్గన్న ని
ర్ధామాతిప్రతిమప్రతాపరవిశత్రుఘ్నుండునిన్గొల్చుదు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ సీమస్థానము - అతిక్రమించు విషదోషిన్ - వార్ధిన్ - రామ క్రియన్ సీమస్థానము - అతిక్రమించు విషదోషిన్ - తున్మి - పేర్ - కన్న - నిర్ధామాతి ప్రతిమప్రతాపరవి - శత్రుఘ్నుండు - నిన్ కొల్చున్.

ప్ర॥ సీమస్థానము = చెలియలికట్టను, అతి......దోషిన్ అతిక్రమించు = దాటివచ్చు, విషదోషిన్ = నీటియందు దోషముకల, వార్ధిన్ = సముద్రుని, రామక్రియన్ = రామచంద్రుడు..., సీమస్థానము = ధర్మము యొక్క పొలిమేరను, అతి......దోషిన్ = అతిక్రమించు = ఉల్లంఘించు విషదోషిన్ = లవణాసురుని తున్మి = సంహరించి, పేర్ = గొప్పవాడను పేరును; కన్న......రవి = కన్న = పొందిన, నిర్ధామము = నివురుగప్పినదియు, అతిప్రతిమ = పోలికలేనిదియునగు; ప్రతాప = శత్రువులను తపింపజేయుటయందు రవి = మండువేసవియందలి సూర్యుడైన, శత్రుఘ్నుండు = బాహ్యశత్రువులను. అంతశ్శత్రువులను సంహరించిన శ్రీరామ చంద్రుని సోదరుడు నిన్ = నిన్ను కొల్చున్ = సేవించును.

చెలియలికట్టను దాటివచ్చు నహంకార దూషితుని సముద్రుని శ్రీరామ ప్రభు వెట్లు శిక్షించెనో యట్లే ధర్మస్థానము యొక్క హద్దునుల్లంఘించి లోకములందు దుర్మార్గమునజెలరేగు లవణాసురుని జయించి ప్రతాపమున మట్టమధ్యాహ్న సూర్యుడగు శత్రుఘ్నుడును మిమ్ము నిత్యముభజించుచుండు.

శా॥ శ్రీమద్రామ కథామృతం బిల నవిచ్ఛిన్నంబుగాఁ గ్రోల్చుచున్
రామధ్యాననిమగ్నతన్ మొగిఁ బరబ్రహ్మమ్ముగాఁ జూచుచున్
మైమౌంజీముఖచిహ్నముల్ గల హనూమంతుడు నిన్గొల్చు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ శ్రీమద్రామ కథామృతంబు - ఇలన్ - అవిచ్ఛిన్నంబు - కాన్ గ్రోల్చుచున్ - రామధ్యాన నిమగ్నతన్ - మొగిన్ - పరబ్రహ్మంబు - కాన్ - చూచుచున్ - మై - మౌంజీ ముఖచిహ్నముల్ - కల హనూమంతుండు - నిన్ - కొల్చున్.

ప॥ శ్రీమద్రామ కథామృతంబు= శ్రీమత్=సంపదకలిగించు= రామ= శ్రీరామచంద్రుని యొక్క కథా = చరిత్రయైన రామాయణమను, అమృతంబు = అమృతమును, ఇలన్ = భూమియందు, అవిచ్ఛిన్నంబుగాన్ = తెంపులేకుండునట్లు గ్రోల్చుచున్ = ఎల్లవారిచేఁ ద్రాగించుచు (అనుభవింప జేయుచు) రామ .....తన్ = రామ = శ్రీరామచంద్రునియొక్క, ధ్యాన యోగమందు నిశ్చలముగా భావించుటయందైన నిమగ్నతన్ = ఇతరవిషయములు తలచూపకయుండ తన్మయత్వముచే, మొగిన్ = చీమ మొదలు బ్రహ్మవరకు. పరబ్రహ్మంబుగా = పరమాత్మ శక్తిస్వరూపమ్ముగా, చూచుచున్ పరామర్శించుచు మై = శరీరమందు, మౌంజీ ముఖచిహ్నముల్ = మౌంజీ దర్భ మొదలగు త్రాఁడు ముఖ = మొదలయిన, చిహ్నముల్ = బ్రహ్మచారిలక్షములు, కల హనూమంతుండు = కల= ఒప్పుచున్న, హనూమంతుండు. = ఆంజనేయస్వామి. నిన్ = నిన్ను = కొల్చున్ = సేవించును.

శ్రీమద్రామాయణమను నమృతము నెల్లవారికి పంచిపెట్టుచు సర్వకాలమును శ్రీరామచంద్రుని దివ్యమంగళమూర్తిని యోగదృష్టియందు కనులపండువుగాను జూచుచు వస్తుసృష్టినందలి సర్వమును పరబ్రహ్మమయముగా భావించు నంతర్ముఖుఁడు సకల దేవతాంశ సంభూతుఁడు హనుమంతుఁడు మిమ్ము భజించుచుండును.

శా॥ ప్రామిన్కుల్రతనాలపేటిజగతీ భాగ్యప్రబోధంబు తే
జోమూలంబు సువర్తులాకృతిమహ స్తోమంబు బాహ్యాంతర
వ్యామోహాగ్రతమోనివర్తకము భాస్వన్మూర్తినిన్గొల్చు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప్రామిన్కుల్ రతనాలపేటి-జగతీ భాగ్యప్రబోధంబు - తేజోమూలంబు - సువర్తులాకృతి - మహాస్తోమంబు - బాహ్యాంతర వ్యామోహాగ్రత మోనివర్తకము - భాస్వన్మూర్తి - నిన్ - గొల్చున్.

ప్ర॥ ప్రా........పేటి = ప్రామిన్కుల్ = వేదములకు, రతనాలపేటి = రత్నముల వికారమయిన పెట్టెవంటివాఁడును, జగ......... బోధంబు = జగతీ = ప్రపంచములకు = భాగ్య = అష్టైశ్వర్యములను, ప్రబోధంబు = తెలియఁజేయువాఁడును, తేజోమూలంబు = తేజః = లోకములయొక్క ప్రకాశమునకు, మూలంబు కారణమయినవాఁడును, సువర్తులాకృతి = సు = మిక్కిలి, వర్తుల = గుండ్రనయిన, ఆకృతి = ఆకారము కలవాఁడును, మహాస్తోమంబు = మహః = చర్మచక్షువులకు గోచరముగాని గొప్ప వెలుగులయొక్క, స్తోమంబు = సమూహమయినవాడుఁను బాహ్యాంతర............నివర్తకము = బాహ్య = వెలపలయందైనదియు, అంతర = లోపలనైనదియునగు, తమః = చిమ్మచీఁకటిని. నివర్తకము పోఁగొట్టువాఁడునునగు, భాస్వన్మూర్తి = సూర్యభగవానుఁడు, నిన్ = నిన్ను గొల్చున్. సేవించును.

వేదములకు స్థానమయినవాఁడును సర్వప్రపంచమునకు నిత్యారోగ్య భాగ్యము గలిగించువాడుఁను, ప్రకాశమునకు కారణమైనవాఁడును గుండ్రని మండలముకలవాడుఁను, నగు సూర్యుఁడు నిన్ను సదాభజించుచుండు

శా॥ వ్యోమాలంకృతినిర్మలాకృతికలా పూర్ణుండుసర్వౌషధీ
భూమానందము కౌముదీనిధి భవ న్మూర్ధప్రసూనంబు నం
భోమంజూషదృగుత్పలప్రసవక ర్పూరంబునిన్గొల్చు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ॥

వ్యోమాలంకృతి - నిర్మలాకృతి - కలాపూర్ణుండు - సర్వౌషధీ భూమానందము - కౌముదీనిధి - భవన్మూర్ధ ప్రసూనంబు-అంభోమంజూష-దృగుత్పల ప్రసవ కర్పూరంబు - నిన్ - కొల్చున్

వ్యోమాలంకృతి = వ్యోమ = ఆకాశమునకు = అలంకృతి = అలంకారమయినవాఁడును నిర్మలాకృతి = నిర్మల = స్వచ్ఛమయిన ఆకృతి = ఆకారము కలవాఁడును, కలాపూర్ణుండు = కలా = పదియారుకళలతో, పూర్ణుఁడు, నిండియుండువాఁడు సర్వౌ.........దము, సర్వ = సమస్తమయిన ఓషధీ = ఫలపాకాంతములు (పండుటయే అంతముగా గలవి) అయిన వరి - జొన్న - మొదలయినవానికి రావి మొదలయిన వృక్షములకును= భూమ = అధికమయిన; ఆనందము = చల్లని యమృత కిరణములు ప్రసరింపజేయుటచే సంతోషము కలిగించువాఁడును = కౌముదీనిధి = కౌముదీ = సర్వపదార్థములను తెలియఁజేయు పండువెన్నెలలకు, నిధి స్థానమైనవాడును, భవ......నంబు భవత్ = నీయొక్క, మూర్ధ = తలమీద, ప్రసూనంబు = పూవైనవాఁడును, అంభోమంజూష = అంభః = ఉదకమునకు, మంజూష పెట్టెవంటివాఁడును దృగుత్పల......రంబు దృక్ కన్నులను, ఉత్పల=నల్లకలువలను ప్రసూన పుష్పములకు కర్పూరంబు = పచ్చకప్పురమువంటివాడును (లేక) అత్రిముని నేత్రమునందు పుట్టినవాఁడును నగు చంద్రుఁడు, నిన్ = నిన్ను, కొల్చున్ = సేవించును

ఆకాశమున కలంకారమై; స్వచ్ఛమయిన యాకారముకలిగి పదియారు కళలతోఁ గూడినవాఁడును, నెల్లపైరులను పోషించువాఁడును, మీకు తలపూవగువాఁడును, నీటికి స్థానమైనవాఁడును, కన్నులకు పండువగువాఁడును నగు చంద్రుఁడు మిమ్ము కొల్చుచుండును.

శా॥ భూమిప్రేమనిదానభూమి నిధిసం పూర్ణప్రమోదావహ
స్థేమస్థానవదాన్యమౌళి, విలస త్సిందూరమందార తే
జోమీమాంస కుజుండు నిన్నుమది నెంచున్భక్తియుక్తాత్ముడు
రామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ !

భూమిప్రేమనిదానభూమి – నిధిసంపూర్ణ ప్రమోదావహస్థేమస్థానవదాన్యమౌళి – విలసత్సిందూర మందార తేజోమీమాంస – కుజుండు – నిన్నున్ – మదిన్ – ఎంచున్ = భక్తియుక్తాత్మన్.

భూమి......భూమి, భూమి = భూదేవియొక్క, ప్రేమ = వాత్సల్యమునకు నిదానభూమి = స్థానమైనవాఁడు, నిధి......వదాన్యమౌళి నిధి = రత్నములు, బంగారము, వెండి. మొదలయినవానితో, సంపూర్ణ = నిండిన, ప్రమోద = సంతోషమును, అవహ = కలిగించుటయందు, స్థేమ = నిలుకడగల, స్థాన = ప్రదేశములను, వదాన్య = ఇచ్చువారిలో, మౌళి = శ్రేష్ఠుడైనవాఁడును, విలసత్......మీమాంస, విలసత్ = ప్రకాశించుచున్న, సిందూర= ఎఱ్ఱనయిన ధాతురసముయొక్క, మందార = జపాపుష్పములయొక్క, తేజః= కాంతివిశేషమును, మీమాంస = శరీరచ్ఛాయచే విమర్శించు వాఁడునునగు, కుజుండు = అంగారకుఁడు, భక్తియుక్తాత్మన్ = భక్తి = నిలుకడగలభక్తితో, యుక్త =కూడుకొనిన, ఆత్మ = మానసముకల, మదిన్ = చిత్తమునందు, నిన్నున్ = నినున్, ఎంచున్ = భావించుచుండును.

భూమికి కుమారుఁడును, రత్నాలగనులను భూములను మనుజులకు గలిగించువాఁడును, ఎఱ్ఱని కాంతికలవాఁడును నగు నంగారకుఁడు నిత్యము మిమ్ము భజించుచుండును.

శా॥ సామానూనవచః ప్రదాతమిధునా శాస్యప్రియుక్తాస్యుఁడో
జోమైత్రీలతికాలవాలముకలా స్ఫూర్తిస్ఫురన్మూర్తి మే
ధామాకందము సౌమ్యుఁడంచితుఁడు చెంతంగొల్చునిత్యంబు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

సామానూనవచః ప్రదాత - మిధునాశాస్య ప్రియుక్తాస్యుఁడు - ఓజోమైత్రీలతికాలవాలము - కలాస్ఫూర్తి స్ఫురన్మూర్తి - మేధామాకందము - సౌమ్యుఁడు - అంచితుఁడు - చెంతన్ - కొల్చున్ - నిత్యంబు.

సామ......దాత, సామ = ఇంపయినవియు, అనూన = తక్కువ లేనివియు,నగు, వచః = నీతులను ధర్మమును తెలియఁజేయు పలుకుబడులను కలుగఁజేయువాఁడును, మిధున.........క్తాస్యుఁడు, మిధున = దంపతుల కందఱకు, ఆశాస్య = మేలొసంగు దీవనలతో, ప్రయుక్త = కూడుకొనిన, ఆస్యుఁడు = ముఖముకలవాఁడును, ఓజో...లము ఓజః = బుద్ధిబలముతో గూడిన, మైత్రి = స్నేహమును, లతికా=తీగకు, ఆలవాలము = పాదువంటివాఁడును, కలా......మూర్తి. కలా = చతుష్షష్ఠి(అరువదినాల్గు) కళలయొక్క, స్ఫూర్తి. ప్రకటనలతో, స్ఫురత్ = గోచరించుచున్న, మూర్తి = ఆకారముకలవాఁడును, మేధా మాకందము = మేధా = ఊహ అను వనలుతోడుగు బుద్ధివిశేషమును తీగెకు, మాకందము తియ్యమామిడివంటి వాఁడును, అంచితుఁడు = తగిన వాఁడును నగు, సౌమ్యుఁడు బుధుఁడు. నిత్యంబు = ఎల్లప్పుడును, చెంతన్ = నీసమీపమందు, కొల్చున్ = సేవించుచుండును.

చల్లగానింపుగా మాటలాడించువాఁడును, దంపతులకు పెంపు కలిగించుచు దీవనలిచ్చువాఁడును, బలమును స్నేహమును కలిగించువాఁడును, ప్రకటమైన కలాకాంతులు కలవాఁడును, బుద్ధికి మురుసుదనము కలిగించు వాఁడును, శాంతిగుణమునకు కారణమైనవాఁడునగు బుధుఁడు మిమ్ము నిత్యము నుపాసించుచుండును.

శా॥ సామంజస్య గుణప్రశంస్యుఁడు సదాచార ప్రచార స్థిర
క్షేమాకారుఁడు వీక్షణప్రణుదితా శేషప్రదోషుండు ధీ
సామగ్రిప్రతిపాదకుండు విబుధా చార్యుండు నిన్గొల్చు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హరహారాకృతీ!

సామంజస్య గుణప్రశంస్యుఁడు - సదాచార ప్రచార స్థిర క్షేమాకారుఁడు - వీక్షణప్రణుదితాశేషప్రదోషుఁడు - ధీసామగ్రి ప్రతిపాదకుండు - విబుధాచార్యుండు - నిన్ - గొల్చున్ - దుర్గా! మల్లేశ్వర! - సర్వదేవ పరివారా! - హారహీరాకృతీ! -

సామంజస్య......స్యుఁడు, సామంజస్య = మంచితనముచేతను, గుణ = సదాధారము, శాంతి, ఓర్పు మొదలగు గుణములచేతను, ప్రశంస్యుఁడు = కొనియాడుటకు తగినవాఁడును, సదాచార......రుఁడు, సదాచార = మంచిని యాచరించుటను, ప్రచార = వ్యాపింపజేయుట యందు, స్థిర = నిలుకడగలదియును, క్షేమ = లోకములకు మేలు కలిగించునదియునగు ఆకారుఁడు = శరీరము కలవాఁడును వీక్షణ......షుండు వీక్షణ = చూచుటచేతనే, ప్రణుదిత = మిగులు లేకుండునట్లుగా నశింపఁజేయఁబడిన, ప్రదోషుండు గొప్పదోషములు కలవాఁడును. ధీ......కుఁడు, ధీ = బుద్ధి విశేషమునకు తగిన, సామగ్రి = పరికరమును, ప్రతిపాదకుండు = కలుగఁ జేయువాఁడునునగు, విబుధాచార్యుండు = దేవతలకు గురువయిన బృహస్పతి, నిన్ = సర్వమును పోషించు నిన్ను, కొల్చున్ = భావించుచుండును.

మంచి గుణములచేఁ గొనియాడఁదగినవాఁడును ఎల్లప్పుడును, మంచి యాచారమున నడపించువాడును, ప్రపంచమునకు నిలుకడగల మేలు గలిగించువాఁడును, చూచునంతనే ఎల్లదోషములను పోగొట్టువాఁడును, బుద్ధి బలమునకు తగినంత పరికరమును సమకూర్చువాఁడును, దేవతలకు గురువును నగు బృహస్పతి మిమ్ము నిత్యము భజించుచుండును.

శా॥ గోమాణిక్య కలావిశేషము వచో గుంభప్రియం భావుక
శ్రీమేధః పరిపుష్టి సర్వసుకలా సిద్ధాంత ఘంటాపథ
గ్రామాభ్యంతర సీమ కావ్యఁడు శుభాకారుండు నిన్గొల్చు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ గోమాణిక్య కలావిశేషము-వచోగుంభప్రియం భావుకశ్రీమేధః పరిపుష్టి - సర్వసుకలా సిద్ధాంత ఘంటాపథ గ్రామాభ్యంతరసీమ - కావ్యఁడు- శుభాకారుండు - నిన్ - కొల్చున్

ప్ర॥ గోమాణిక్య కలావిశేషము; గో = చంద్రాది గ్రహమండలముల యందు, మాణిక్యము = విశేష కాంతికలవాఁడును, వచో.....పుష్టి:వచః = వాక్కులను, గుంభ = గుప్పించుటయందు, ప్రియంభావుక = ఇంపుఁదనము కలిగించునట్టిదియు, శ్రీ = శుభములను సంపదలను గలిగించునదియునగు, మేధః = మెదడుయొక్క, పరిపుష్టి = బలము కలిగించువాఁడును, సర్వ................సీమ, సర్వ = సకలమయిన, సుకలా = అరువది నాల్గు కలలను, సిద్ధాంత = నిరూపించుటయును, ఘంటాపథ = రాజమార్గమునకు, గ్రామాభ్యంతరసీమ = గ్రామములోని మధ్యప్రదేశము వంటివాఁడును, శుభాకారుండు = శుభ = మేలును గలిగించు, ఆకారుఁడు = మూర్తి కలవాఁడును నగు, కావ్యఁడు = కవియైన శుక్రుఁడు,నిన్ = పురాతన కవియైన నిన్ను, కొల్చున్ = భజించుచుండును.

సూర్యేతరములయిన గ్రహమండలములలో మిక్కిలి కాంతికలవాఁడగుట సన్నని వెన్నెల గాయువాఁడును, ఇంపైన పలుకుబడులను గుప్పించు మెదడునకు బలము గలిగించువాఁడును, చతుష్షష్టి కలలను స్థిరపఱచి నడపించువాఁడును నగు శుక్రుఁడు మిమ్ము వేడుచుండును.

శా॥ ద్యోమార్గాంతరమందగామి, యఘ యాదోరాశి, నిర్మగ్న చే
తోమంథానము, తావకీనగళవిద్యోతప్రమేయాత్మ శో
భా మూర్తిస్ఫుర,సౌరి కొల్చు నిను శుంభ ద్భక్తిసంయుక్తి దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ ద్యోమార్గాంతర మంద గామి - అఘయాదోరాశి నిర్మగ్న చేతో మంథానము - తావకీనగళవిద్యోత ప్రమేయాత్మ - శోభామూర్తిస్ఫుర - సౌరి - కొల్చున్ - నినున్ - శుంభద్భక్తి సంయుక్తిన్.

ప్ర॥ ద్యో................గామి, ద్యో=ఆకాశముయొక్క, మార్గ=త్రోవయందు, అంతర = మధ్యప్రదేశమునందు, మంద = మిక్కిలి నిమ్మళముగా, గామి=నడచువాఁడును, అఘ............నము. అఘ = పాపములను, యాదోరాశి = సముద్రమునందు, నిర్మగ్న = మునిఁగిన, చేతః = మనస్సును, మంథానము = కలతపెట్టువాఁడును, తావ..............స్ఫుర, తావకీన = నీసంబంధమయిన, గళ = కంఠభాగముయొక్క, విద్యోత = నల్లనికాంతి విశేషముతో, ప్రమేయ = పోల్పఁదగిన, ఆత్మ = తన యొక్క, మూర్తి=కాంతిగల శరీరముయొక్క స్ఫుర = నీలవర్ణచ్ఛాయ కలవాఁడును, నగు, సౌరి=సూర్యుని కుమారుఁడయిన శని, శుంభ .....క్తిన్ శుంభత్=ఒప్పుచున్న, భక్తి = భక్తియొక్క, సంయుక్తిన్ = పొందికతో, నినున్ = నీలకంఠుండవైన - నిన్ను - కొల్చున్ = పూజించుచుండును.

ఆకాశమునఁదిరుగు గ్రహమండలములలో మిక్కిలి నిదానము గానడచువాఁడును, పాపముచేసినవారి మనస్సులనే కలఁచిపెట్టువాఁడును, మీకంఠము వలె నల్లని కాంతికలవాఁడును నగు శని మీకు దాసిలొగ్గుచుండును

శా॥ భూమీశత్వ ముఖ ప్రకృష్ట పదవీ భూయస్త్వ సంపాదనో
ద్దామప్రఖ్యుఁడు రాహు భోగమకుటోద్యద్ద్యోత రత్నప్రభా
స్తోమద్రావిత రోదసీ తిమిర సందోహుండు నిన్గొల్చు దు
గ్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ భూమీశత్వ ముఖ ప్రకృష్ట పదవీ భూయస్త్వ సంపాద నోద్దామ ప్రఖ్యుఁడు - రాహు - భోగమకు టోద్యద్ద్యోత రత్నచ్ఛటాస్తోమద్రావితరోదసీ తిమిర సందోహుండు .. నిన్ - గొల్చున్.

ప్ర॥ భూమ........ప్రఖ్యుఁడు = భూమీశత్వ = ప్రభుత్వము ముఖ = మొదలుగాగల, ప్రకృష్ట = మిగుల గొప్పదైన, పదవీ = స్థానముల యొక్క, భూయస్త్వ = అధిక్యమును, సంపాదన = కలిగించుటయందు, ఉద్దామ = మిక్కిలి గొప్పదయిన, ప్రఖ్యుఁడు = పేరుగాంచిన వాఁడును, భోగ..............సందోహుండు, భోగ మకుట = కిరీటము వంటి పడగయందు గలవియు, ఉద్యత్ = బయలు దేరుచున్న, ద్యోత = ప్రకాశము కలవియునగు, రత్న = మణుల యొక్క, ప్రభా = కాంతి సమూహము యొక్క ,స్తోమ = పరంపరలచే, ద్రావిత = పరుగులెత్తించిన, రోదసీ = భూమ్యాకాశముల మధ్య యందలి, తిమిర = చిమ్మ చీఁకట్ల యొక్క, సందోహుండు = సమూహము కలవాఁడును, నగు, రాహు = రాహువు, నిన్ = నాగభూషణుఁడవైన నిన్ను, కొల్చున్ = సేవ సలుపుచుండును.

ప్రభుత్వము మొదలయిన గొప్ప పదవులను గలిగించుట యందు పేర్వడసిన వాఁడును, కిరీటమా వంటి తన పడగమీది రత్నకాంతులచే భూమికి నాకాశమునకు మధ్యగల చీఁకటిని పోఁగొట్టు వాఁడును నగు రాహువు మీకు నమస్కార మొనర్చుచుండును.

శా॥ ప్రేమం దా సమస్తకంబున సదా వీక్షించుచున్ రాహువున్
సోమున్ సూర్యుని మిత్రదృష్టిఁ గనుచున్ శుద్ధాంతరంగమ్ముతో
క్షేమంబున్ మదిఁ గోరి కేతువును నీసేవం బ్రవర్తించు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ ప్రేమన్ - తాన్ - సమస్తకంబునన్ - సదా - వీక్షించుచున్ - రాహువున్ - సోమున్ - సూర్యునిన్ - మిత్రదృష్టిన్ - కనుచున్ - శుద్ధాంతరంగమ్ముతోన్ - క్షేమంబున్ - మదిన్ - కోరి - కేతువున్ - నీసేవన్ - ప్రవర్తించున్.

ప్ర॥ తాన్ = తాను, ప్రేమన్ = స్నేహముచే, సదా = ఎల్లవేళలందును, రాహువున్ = రాహువును, సమస్తకంబునన్ = ఒకరునొకరు, వీక్షించుచున్ = చూచుచు, సోమున్ = చంద్రుని, సూర్యున్ = సూర్యునిని, మిత్రదృష్టిన్ = నీసమీపమగుట సమత్వముచేనైన స్నేహదృష్టిచేత, కనుచున్ = చూచుచు, శుద్ధాంతరంగమ్ముతో, శుద్ధ = కోపము, అసూయ మొదలగువాని వదలిన, అంతరంగమ్ముతో = హృదయముతో, క్షేమంబున్ = కుశలమును, మదిన్ = మనస్సునందు, కోరి = కాంక్షించి, కేతువున్ = కేతువుగూడ, నీసేవన్ = నీకొలువునందు, ప్రవర్తించున్ = మెలగుచుండును.

రాహువు తన్నుఁజూచునట్లు తానుగూడ రాహువు నేడింటఁ జూచువాఁడును, మీసమక్షమున సహజశత్రుత్వమును గూడ వదలి సూర్యచంద్రాది గ్రహములను మిత్రులనుగాఁ జూచువాఁడునునగు కేతువును మీ ధ్వజపతాకలను గొనియాడుచుండును.

శా॥ తా మేలౌయవధూతయయ్యు మహిశా స్త్రున్ లోఁబరీక్షింప నే
మేమో వింతలుపన్ని లంపటునియట్లే తోఁచి మూర్తిత్రయో
ద్దామప్రస్ఫుటధాముఁడై వెలయుఁదత్తాత్రేయుఁడౌ మ్రోల దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

పా॥ తాన్ - మేలు - ఔ యవధూత- అయ్యున్ - మహిశాస్త్రున్ - లోన్ - పరీక్షింపన్ - ఏమి - ఏమి - ఓ - వింతలు - పన్ని - లంపటు నియట్లు - ఏ - తోఁచి - మూర్తిత్రయోద్దామ ప్రస్ఫుటధామము-అయి- వెలయు దత్తాత్రేయుఁడు - ఔన్, మ్రోలన్ -

ప్ర॥ తాన్ = తాను, మేలు= లోకమునకు క్షేమము గలిగించుటకు, ఔయవధూత - అయినట్టువంటి యతిసార్వభౌముఁడు (దిగంబరస్వామి) అయ్యున్ = అయియుండియు, మహిశాస్త్రున్ = కార్తవీర్యార్జునుని, లోన్ = హృదయమునందు, పరీక్షింపన్ = పరీక్ష చేయుటకు, ఏమేమో =, చెప్పుటకు వీలుపడని, వింతలు = వినోదములందలి యాశ్చర్యములను, పన్ని = కల్పించి, లంపటునియట్లే = కామమోహాదులతోఁ గూడినవాని యట్లే, తోఁచి = నైకినటించి, మూర్తి..............ధామము, మూర్తిత్రియ = బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులయొక్క, ఉద్దామ – గొప్పదియు, ప్రస్ఫుట = ఎల్లలోకములవారికి ప్రకటమైనదియునగు, ధామము = తేజస్సు, ఐ = అయి, వెలయు = అవతరించిన, దత్తాత్రేయుఁడు = దత్తాత్రేయస్వామి, మ్రోలన్ = నీయందు, ఔన్ = ఒప్పుచుండును.

తాను లోకమునకు క్షేమముగలిగించునవధూతయయ్యు నుపదేశార్థియై తనకడకు వచ్చిన కార్తవీర్యార్జునుని పరీక్షించుటకై నిజయోగమహిమ చే దివ్యాప్సరస్త్రీగోష్ఠుల మెలఁగుచున్నట్లును కైపువస్తువుల సేవించుచున్నట్లును మఱియు నెన్నియో వినోదములను బన్ని బ్రహ్మ విష్ణు రుద్రాంశుఁడయిన దిగంబరుఁడు దత్తాత్రేయుఁడు మీమ్రోల వెలసియుండును.

శా॥ క్షామాడంబరమున్ సృజింపఁగల దుశ్చారిత్ర దుస్తంత్ర మి
థ్యా మూలంబుల దుర్మతేభముల వాదస్ఫార సింహధ్వనిన్
బ్రామిన్స్కాల్ వెలయించు శంకర పరివ్రాట్చంద్రుఁడీ వౌదు దు
గ్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ !

ప. క్షామాడంబరమున్ - సృజింపన్ - కలదుశ్చారిత్ర దుస్తంత్ర మిథ్యా మూలంబులన్ - దుర్మతేభములన్ - వాదస్ఫార సింహధ్వనిన్ - బ్రామిన్స్కాల్ - వెలయించు శంకర పరివ్రాట్టు - ఈవు - ఔదు.

ప్ర. క్షామాడంబరమున్, క్షామ, కఱవు యొక్క, ఆడంబరమున్ = లోకములను భయపెట్టు పద్ధతిని, సృజింపన్ = కల్గించుటకు, కల..........మూలంబులన్ = కల = సమర్థములయినవియు, దుశ్చారిత్ర = దుష్టమయిన నడవళ్లు కలవియు, దుస్తంత్ర = చెడ్డవయిన పన్నుగడలు కలవియు, మిథ్యా మూలంబులన్ = మాయయే (తెలియకుండుటయే) కారణముగాఁ గలవియునగు, దుర్మతేభములన్, దుర్మతి = నీ శాసనము నుల్లంఘించు మతములను, ఇభములన్ = మదపు టేనుఁగులను, ఉద్దేశించి, ప్రత్యక్షమునందు, వాద.....ధ్వనిన్, వాద = శాస్త్ర యుక్తమయిన యుక్తితో వాదించుటయను, స్ఫార = అడ్డులేని, సింహధ్వనిన్ = సింహగర్జనముచే, బ్రామిన్స్కాల్ = వేదములను, వెలయించు శంకర పరివ్రాట్చంద్రుఁడు, వెలయించు = లోకములందు నెలకొల్పిన, శంకరపరివ్రాట్టు = శంకరాచార్యస్వామి, ఈవు = నీవు, ఔదు = ఐ యున్నావు.

లోకములకు కటిక కఱవును గలిగించు దుష్ట మతములను మదపు టేనుఁగు లడలిపాఱి పోవునట్లు శాస్త్రవాద మను సింహగర్జన మొనర్చు శంకరాచార్య పరమహంస జగద్గురువు మీ యపరావతారము మీయందు నెలకొని యుండును.

శా॥ సామోద్భూతము నాదరూపమును నౌ సంగీత రత్నాకరం
బా మూలంబు మథించి సత్కృతుల గేయంబౌ సుధాధార శ్రీ
రామ బ్రహ్మముఁ దన్పు త్యాగయ సదా రంజిల్లు మీ మ్రోల దు
గ్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

అ॥ సామోద్భూతము - నాదరూపమున్ - ఔ - సంగీత రత్నాకరంబు - ఆ మూలంబు - మథించి - సత్కృతులన్ - గేయంబు - ఔ సుధాధారన్ - శ్రీరామ బ్రహ్మమున్ - తన్పు త్యాగయ - సదా - రంజిల్లున్ - మీ మ్రోలన్.

ప॥ సామోద్భూతము. సామ = సామవేదమునుండి, ఉద్భూతమున్ = జనించినదియును, నాదరూపమును = నాదమే రూపముగాఁ గలదియును, ఔ సంగీత రత్నాకరంబు = అయిన సంగీతమునకు సముద్రము వంటి దయిన గ్రంథమును, (మతంగుడు భరతుఁడు, మొదలగు పూర్వాచార్యుల మతములు పరిశీలించి శార్ఙ్గదేవునిచే వ్రాయఁబడినది) ఆమూలంబు = అంతు తెలియు వఱకు, మథించి = పరామర్శించి శోధించి. (బాగుగ విచారించి) సత్కృతులన్ = మంచి కీర్తనల పాఠములయందు, గేయంబు = పాట యను రూపము గలది, ఔ సుధాధారన్ = అయిన యమృతంపు సోనచే, శ్రీరామ బ్రహ్మమున్ = పరమాత్మ స్వరూపుఁడైన రామచంద్రుని (లేక) తన్నుత ప్రియమయిన రామబ్రహ్మమును. తన్పుత్యాగయ = తృప్తిఁబఱచు త్యాగయ్య, సదా = ఎల్లప్పుడు, మీ మ్రోలన్ = మీయెదుటను, రంజిల్లున్ = సంతోషించుచుండును.

సామవేదమునందుఁబుట్టి లోపల వెలపల నంతట నిండియున్న నాద బ్రహ్మ స్వరూపమును దెలియఁజేయు సంగీత రత్నాకరమును తఱచి తఱచి మంచి కృతులనుగేయ రూపమగు నమృతముచే లోకముల నన్నిఁటి నిరంతరము దనియఁ జేయుచు శ్రీరామ చంద్రునే తనకు శ్రోతఁగాఁ జేసికొనిన మహాయోగి త్యాగరాజు సర్వదా మిమ్ము సేవించుచున్నాడు.

శా॥ సామర్థ్యంబున శృంగ శబ్దధృతి ప్రాశస్త్యంబు బోధింపఁగా
భీమంబౌ నిజ కంఠనాదమున దుర్వీరు ల్భయంబందఁగా
నీముందే నివసించి నిన్నుఁ గొలుచు న్నిర్ణిద్రుఁడౌ నంది దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ॥

ప॥ సామర్థ్యంబునన్ - శృంగశబ్ద ధృతి - ప్రాశస్త్యంబున్ - బోధింపన్ - కాన్ - భీమంబు - ఔనిజ కంఠనాదమునకున్ - దుర్వీరుల్ - భయంబు - అందన్ - కాన్ - నీముందు - ఏ - నివసించి - నిన్నున్ - కొలుచున్ = నిర్ణిద్రుఁడు - ఔనంది.

ప్ర॥ సామర్థ్యంబునన్ = సమర్థత్వముచేత, శృంగశబ్దధృతి=శృంగ= శృంగమను, శబ్ద = శబ్దము యొక్క, ధృతి=ధరించుట, ప్రాశస్త్యంబున్= గొప్ప తనమును, (శృంగ శబ్దమునకు, కొమ్ము, గొప్పతనము; అను రెండర్థములు కలవు) బోధింపఁగాన్ = తెలియఁ జేయుచుండఁగా, భీమంబు = శత్రువులకు భయంకరమైన, ఔ.....మునకున్, ఔ = తగినది, నిజ = స్వకీయ మయినదియు నగు, కంఠ = కంఠము యొక్క, నాదమునన్ = ఘుణిల్లుమను ఱంకచే, దుర్వీరుల్ = నీతిమాలిన పరాక్రమము కలవాండ్రు, భయంబున్ = వెఱపును, అందన్ = చెందఁగా, నిర్ణిద్రుఁడు = నిరంతరము జాగ్రత్త కలవాడు, ఔనంది = ఆయిన వృషభేశ్వరుఁడు, నీముందే = నీ ముంగిటి యందే, నివసించి = కనిపెట్టుకొని యుండి, నిన్నున్ = పదునాల్గు భువనములు కలనిన్ను, కొలుచున్. ప్రియాణముల యందు నిన్ను మోయుచు నిరంతము నీ పాదారవిందములను భజించుచుండును.

తలమీది కొమ్ములచే నన్నిఁటియందు సమర్థుడను విషయమును తెలియఁజేయుచు భయంకరమై ఘుణిల్లుమను తన పెద్దఱంకెను నీతి మాలిన పరాక్రమము జూపించు దుష్టులు పరుగులెత్త మిక్కిలి మెలఁకువతో వృషభేశ్వరుడు (నందీశ్వరుఁడు) సర్వకాలము మీ పాదసేవన మొనర్చు చుండును.

శా॥ బూమెల్పన్నెడు చెట్టరక్కసులు వాపోవంగ గర్జిల్లుచున్
బాముల్పెట్టెడు కిల్బిషేభవితతిం బాదాహతిన్ వ్రచ్చుచున్
నేమంబొప్పఁగ సింహవాహనము నిన్నిత్యమ్ము సేవించు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ బూమెల్ - పన్నెడు చెట్టరక్కసులు - వాపోవన్ - కన్ - గర్జిల్లుచున్ - బాముల్ - పెట్టెడు కిల్బిషేభ వితతిన్ - పాదాహతిన్ - వ్రచ్చుచున్ - నేమంబు - ఒప్పన్ - కన్ - సింహవాహనము - నిన్ - నిత్యంబు - సేవించున్.

బూమెల్ = మాయవేషములను, పన్నెడు........సులు-పన్నెడు= కల్పించుకొను, చెట్ట = చెడ్డవాండ్రయిన, రక్కసులు = రాక్షసులు, వాపోవన్ = భయముచే బిగ్గరగా నేడ్చునట్లు, గర్జిల్లుచున్ = దిక్కులు పగిలి పోవునట్లు ధ్వనిఁజేయుచు, బాముల్ = కష్టములను, పెట్టెడు...... వితతిన్, పెట్టెడు = కలిగించెడు, కిల్బిష = పాపములనెడు, ఇభ = మదపు టేనుంగులయొక్క, వితతిన్ = సమూహమును, పాదాహతిన్, పాద = కాలియొక్క, ఆహతిన్ = కొట్టుటచే, వ్రచ్చుచున్ = చీల్చుచు, నేమంబు = నియమము, ఒప్పఁగన్ = ఒప్పుచుండఁగా, సింహవాహనము= మృగరాజవాహనము, నిన్ = మహిషాసుర మర్దనివైన నిన్ను, నిత్యంబు=సర్వకాలమును, సేవించున్ = శుద్ధసత్త్వగుణముతో నన్నువహించుచు భజించుచుండును.

భయంకరమైన తనగర్జనముచే కపటవేషధారులగు చెడ్డరక్కసుల నేడ్పించుచు లోకములను కష్టపెట్టెడు పాపులను మదపు టేనుగులను కాలవ్రేలి గోటిచేఁ జీల్చి చెండాడు సింహవాహనము నిత్యము మీ పాద సంసేవనము జేయుచుండును.

శా॥ ఐమాకారము దుర్గయందుఁగల యయ్యష్టాక్షరీ సారముౙ
భా మల్లేశపదంబున న్వెలయు త త్పంచాక్షరీ సారముౙ
దా మేకత్వముఁజెంది యిక్కలిని భ క్తత్రాణముఁబూనె దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ ఐం ఆకారము-దుర్గయందుౙ - కల - అష్టాక్షరీ సారముౙ - భా మల్లీశపదంబునౙ - వెలయు-తత్పంచాక్షరీ సారముౙ - తాము - ఏకత్వముౙ - చెంది - ఇక్కలిౙ - భక్తత్రాణముౙ - పూనెౙ,

ప్ర॥ ఐమా కారము = జ్ఞానస్వరూపమయిన, దుర్గయందుౙ = దుర్గాశబ్దమునందు, కల..............ముౙ, కల = ఒప్పుచున్న, అయ్యష్టాక్షరీ = సుప్రసిద్ధమయిన నారాయణయను ప్రధానాక్షరములుకల మంత్రముయొక్క, సారముౙ = సారమయిన "రా" యను బీజమును, భా = ప్రకాశముగల, మల్లేశపదంబునౙ = మల్లేశ్వర పదమునందు, వెలయు.........ముౙ; వెలయు = ఒప్పుచున్న, తత్ = సుప్రసిద్ధమయిన నమశ్శివాయ యను రూపము ప్రధానముగా గల, పంచాక్షరీ = పంచాక్షరీ మంత్రముయొక్క, సారముౙ = సారమయిన "మ" యను బీజమును తాము దేవతా స్వరూపములయిన "రా" "మ" యను రెండు బీజములు, ఏకత్వమున్ రామ యను నొక స్వరూపమే ధరించి, ఇక్కలిన్ = ఈకలియుగమందు, భక్త త్రాణమున్; భక్త = భజించు భక్తులయొక్క త్రాణమున్ = రక్షణమును, పూనెన్ = వహించెను.

దుర్గా' యనుపదమునుండి "యష్టాక్షరీ" సారమయిన'రా' యనునక్షరంబును మల్లీశ్వరపదమునుండి "పంచాక్షరీ" సారమయిన "మ" కారమును నుభయము త్రిసారమై యేర్పడి తారకమంత్రరాజమై స్మరించుమాత్రమున నాబాలగోపాలమును దుర్గామల్లేశ్వరయను సంబోధనము తరింపఁ జేయుచున్నది.

శా॥ నీమస్తంబువలెన్ జడల్‌గల తలల్ నెమ్మేన భస్మం బెదన్
నీమంత్రంబుసతంబు నిండుకొనఁ బ్రాన్కి న్నీ సమక్షంబునన్
గోమౌమూర్తుల శృంగిభృంగిరిటి ముఖ్యుల్ గొల్తు రెల్లప్పు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ !

ప॥ నీమస్తంబు వలెన్ - జడల్ కల - తలల్ - నెమ్మేనన్ - భస్మంబు - ఎదన్ - నీమంత్రంబు - సతంబు - నిండుకొనన్ - బ్రాన్కిన్ - నీసము క్షంబునన్ - గోము - ఔమూర్తులన్ - శృంగిభృంగిరిటి - ముఖ్యుల్ - కొలుదురు - ఎల్లప్పున్ -

ప్ర॥ నీమస్తంబువలెన్ = నీశిరస్సుమాదిరిగా, జడల్ = అడపలుగట్టిన కేశములు, కలతలల్ = ఒప్పుచున్న శిరస్సులతో, నెమ్మేనన్ = నిండయిన శరీరమునందు, భస్మంబు = విభూతిప్రాంతియు, ఎదన్ = హృదయమునందు నీమంత్రంబు = పంచాక్షరియు, సతంబు = సర్వకాలమును, నిండుకొనన్ = వ్యాపింపఁగా, నీసమక్షంబునన్ = నీసమీపమునందు, గోము = కోమలత్వము, ఔమూర్తులన్ = ఒప్పునట్టి విగ్రహములతో, శృంగి భృంగిరిటి ముఖ్యుల్ = శృంగి భృంగిరిటి, మహాకాళ చండీశ్వరుఁడు మొదలగువారు, ఎల్లప్పుడు = ప్రత్యహమును, కొల్తురు = నిన్ను సేవించుచుందురు.

ప. తలలయందు జటా జూటములు, శరీరమందు భస్మము ప్రకాశింప నిన్ను దలపించుచు హృదయమున నీ మంత్రము (పంచాక్షరి) జపించుచు శృంగి, భృంగి రిటి, మహాకాళ. చండీశ్వరులు మొదలయిన ప్రమథులు సర్వవేళల మిమ్ము భజించుచుందురు.

శా॥ నీమ్రోయించెడుఢక్క కారణముగా నిష్పన్నమై సర్వదా
స్వామిత్వప్రతిపాదకత్వమునకౌ శబ్దప్రధానమ్మునై
నీమూలస్థితిఁదెల్పు వ్యాకరణము న్నిన్దెల్పు నిత్యంబు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ నీమ్రోయించెడుఢక్క - కారణము - కాన్ - నిష్పన్నము - ఐ, సర్వదా - స్వామిత్వ, ప్రతిపాదకత్వమునకు - ఔ శబ్దప్రధానమున్ - ఐ - నీమూలస్థితిన్ - తెల్పువ్యాకరణమున్ - నిన్ - తెల్పున్ - నిత్యంబున్.

ప్ర॥ నీమ్రోయించెడుఢక్క=నీవు మ్రోగించెడు ఢక్కయను వాద్య విశేషము, కారణము = ఆ మొదలు శ వఱకుగల యచ్చులకు, హల్లులకు జననీస్థానము, కాన్ = అగుచుండఁగా, నిష్పన్నమై = కలిగినదై, సర్వదా = ఎల్లవేళలయందును, స్వామిత్వ......నకు, స్వామిత్వ = ప్రభుత్వము నిలువ బెట్టుటకు, ఔ.........నై, ఔ = అయినటువంటి. శబ్దప్రధానమ్మున్= శబ్దమే ప్రధానముగాఁగలదియును, ఐ = అగుచు, నీ.........స్థితిన్ = నీ = నీయొక్క, మూల = ప్రధానమయిన, స్థితిన్ – ఉనికిని, తెల్పువ్యాకరణమున్ = స్ఫుటముగాఁదెలియఁజేయు, వ్యాకరణమున్ = వ్యాకరణశాస్త్రమును, నిత్యము = నిరంతరమును, నిన్ = వాచామగోచరుఁడవగు నిన్ను, తెల్పున్ = వాదసిద్ధాంతములచే, భజించుచుండును.

నీచేతిఢక్కనుండి "అ ఇ ఉణ్" మొదలయిన వర్ణమాతృకా మాలికను తెలియఁజేయు సూత్రములుగా వెలువడి లోకములందు మీ ప్రభుత్వశక్తిని శబ్దప్రమాణముచే విశదపరచుచు సర్వకారణములకు కారణమైన మిమ్ము శబ్దార్థరూపముగా మిమ్ముఁదెలియఁజేయుటకే వ్యాకరణశాస్త్రము ప్రవర్తించుచున్నది.

శా॥ నేమం బొప్పఁగఁ జండశాసనమున న్నీరేజ జాండంబులన్
సామర్థ్యంబున మంచిచెడ్డలను విశ్వాసోక్తి బోధించుచున్
నీ మాహాత్మ్యము దెల్పు శిక్షయును బూన్కి న్విశ్వసంరక్ష దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా ! హారహీరాకృతీ!

ప॥ నేమంబు-ఒప్పఁగన్-చండశాసనమునన్-నీరేజజాండంబులన్-సామర్థ్యంబునన్ - మంచిచెడ్డలన్ - ఈ-విశ్వాసోక్తిన్ - బోధించుచున్, నీమాహాత్మ్యమున్ - తెల్పున్ - శిక్షయున్- పూన్కిన్ - విశ్వసంరక్ష

ప్ర॥ నేమంబు = నియమము, ఒప్పఁగన్ = తనరుచుండఁగా, చండశాసనమునన్, చండ = భయంకరమయిన, శాసనమునన్ = శిక్షచేతను, సామర్థ్యంబునన్ - అన్నిఁటియందు దాటితేటియుండుట చేతను, నీరేజ జాండమ్ములన్ = బ్రహ్మాండ గోళములయందు, మంచిచెడ్డలన్ = విధి నిషేధములను, విశ్వాసోక్తిన్ = వేదములయందు నీయందు పెద్దలయందు ప్రమాణముగల పలుకుఁబడిచే, నీమాహాత్మ్యమున్ = నీమహిమ విశేషమును శిక్షయను వేదాంగమును, ఓవిశ్వసంరక్ష! = విశ్వమంతయును పరిపాలించు తండ్రీ! పూన్కిన్ = పట్టుదలచే, తెల్పున్ = విశదపఱచును.

తీవ్రమయిన శాసనముతో "ధర్మంచర" "సత్యంవద"యను విధిని "నకళంజం భక్షయేత్" "నాప్సునిష్ఠీవయేత్తను" నిషేధమును లోకములకు బోధించుచు మీయందు, వేదములయందు, గురువులయందు ప్రమాణబుద్ధి కలిగించుచు వేదాంగమయిన శిక్షయుఁ మిమ్ము కొనియాడుచుండును.

శా॥ ధూమంబెచ్చట నగ్నియచ్చటను సూక్తుల్ చూపి కార్యాత్మకం
బౌ మాయా శబలంబు విశ్వమున ముఖ్యంబౌ నుపాదాన మీ
వే ముమ్మాటికటంచుఁ దర్కమును నెంతేఁ దెల్పు సర్వత్ర దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా! హారహీరాకృతీ!

ప॥ ధూమంబు - ఎచ్చటన్ - అగ్ని - అచ్చటన్ - అను సూక్తుల్ - చూపి - కార్యాత్మకంబు - ఔ మాయా - శబలంబు - విశ్వమునన్ - ముఖ్యంబు - ఔ నుపాదానము - ఈవు - ఏ - ముమ్మాటికి - అటు - అంచున్ తర్కమున్ - ఉ - నిన్నున్ - ఏ - తెల్పున్ - సర్వత్ర.

ప్ర॥ ధూమంబు=పొగ, ఎచ్చటన్=ఏచోటు నందుండునో, అగ్ని = నిప్పు, అచ్చటన్=ఆచోటునందుండును, అను సూక్తుల్ = అనునట్టి మంచి యుక్తియుక్తములగు పలుకులను, చూపి = ఉదాహరించుచు, కార్యాత్మకంబౌ = కార్య స్వరూపమయినదియు, మాయా శబలంబు, మాయా = మాయచేత, శబలంబు = క్రిమి, కీటక, పశు, పక్షి, వృక్ష, పర్వత, నర, దేవాది వివిధ రూపములుగా గనపించునదియునగు, విశ్వమునన్ = ప్రపంచ విషయమునందు, ముఖ్యంబు = ప్రధానము, ఔ నుపాదానము = అగు కారణము, ముమ్మాటికి = తప్పక, ఈవే = నీవే, అటంచున్ = అనుచు, తర్కమున్ = తర్క శాస్త్రమును ఎంతేన్ = ఎంతయును, సర్వత్ర = ఎల్ల లోకములయందును, తెల్పున్ = అనుమితి (ఊహ) యను ప్రమాణముచే గట్టిగా బోధించుచుండును.

ఇంటి కప్పునుండి వెడలిన పొగను జూచి యింటిలో పొయ్యి రాజ వేసినారని గుర్తించినట్లు చిత్ర విచిత్రము లయిన యాకారములతో వివిధముగా గోచరించు సర్వ ప్రపంచమునకును కర్త మీరే యనుచు, తెలియఁ జేయుచు తర్క శాస్త్రమును మీకే ధార యిచ్చుచున్నది.

శా॥ భూమిం జేసిన యజ్ఞసాధనము రూపుఁ బీడినన్ సంస్కృతిన్
దీమంబైన యపూర్వమే నను చనందించుఁ ఫలంబంచు వా
క్సామర్థ్యంబును జూపుఁ గర్మవిధి విశ్వాసంబు మీమాంస దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ భూమిన్ - చేసిన యజ్ఞసాధనము - రూపున్ - వీడినన్ - సంస్కృతిన్ - దీమంబు - ఐన యపూర్వము - నేను - అనుచున్ - అందించున్ - ఫలంబు - అంచున్ - వాక్సామర్థ్యంబున్ ఈ - చూపున్ - కర్మవిధి - విశ్వాసంబు - మీమాంస.

ప్ర॥ భూమిన్ = కర్మభూమియందు, చేసిన యజ్ఞసాధనము, చేసిన = ఆచరించినట్టి, యజ్ఞ = యజ్ఞములయొక్క, సాధనము స్రుక్కు స్రువము మొదలయిన సర్వపరికరములు, రూపున్ = స్వరూపమును, వీడినన్ = విడచినప్పటికిని (నశించినప్పటికిని) సంస్కృతిన్ = సంస్కారరూపమునందు, దీమంబు = స్థాయి ఐన, యపూర్వము = అయినటువంటియపూర్వము (కంటికి మాత్రము కన్పింపక గాలివలె ఫలమును క్రియారూపమున జూపునది) నేను = సోమయాజికి ఫలము కలిగించువాఁడను నేనని కర్తృత్వము బూనుకొన్నాను, అనుచు = తెలియఁజేయుచు, ఫలంబున్ యజ్ఞఫలమును, అందించున్ = పొందించును, అనుచున్ = అనుచు, కర్మవిధి, కర్మ = సమస్తకర్మకలాపమునకు, విధి = శాసకమును విశ్వాసంబు = ప్రమాణము (నమ్మకము) రూపముగా కలదియునగు, మీమాంస = మీమాంసశాస్త్రము (విషయమును సహేతుకముగా విమర్శించునది) వాక్సామర్థ్యంబున్, వాక్ = వేదములయొక్క, సామర్థ్యమ్మున్ = గొప్పతనమును, చూపున్ = తెలియఁజేయుచుండును.

కర్మభూమియందుఁ జేసిన యజ్ఞసాధనములగు స్రుక్స్రువములు, హోమసాధనములు నీ సోమయాజి మొదలయినవి నశించినను సంస్కారరూపమయిన యపూర్వముచేఁ బరలోకమున ననుభవింపఁదగిన ఫలమును తప్పక యనుభవింపఁజేయునని మీమాంసాశాస్త్రమును కర్మాధారమిమ్ముగొని యాడుచుండును.

శా॥ లోమాటైన యథార్థతత్త్వమునవౌ లోతుల్ పరిబోధించుచున్
సామోదంబుగ సర్వశబ్దముల నీయందే సమర్పించి నీ
ప్రామాణ్యంబు దృఢంబుఁజేయ భువినెవ్వాటన్ నిరుక్తంబు దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా! హారహీరాకృతీ!

లోన్ - మాటు - అయిన యథార్థతత్త్వమునన్ - జౌలోతుల్ పరిబోధించుచున్ - సామోదమ్ముగన్ - సర్వ శబ్దములన్ - నీయందు - ఏ - సమర్పించు - నీ ప్రామాణ్యంబున్ - దృఢంబున్ - చేయున్ - భువిన్ - ఎవ్వాటన్ - నిరుక్తంబు.

లోన్ = శబ్దములోపల, మాటు = కన్పింపక, ఐనయథార్థతత్త్వమునన్. ఐన = ఉండునట్టి, యథార్థ = నిజమయిన, తత్త్వమునన్ = హృదయమునన్ = హృదయమునందు, జౌలోతుల్ = ఒప్పుచున్న గొప్పవిషయములను, పరిబోధించుచున్ = బాగుగఁదెలియపఱచుచు, సామోదమ్ముగన్ = సంతోషాతిశయముతో గూడుకొనియుండునట్లుగా, సర్వశబ్దముల్ = పైకి వివిధదేవతల పేరులుగా గనుపించుశబ్దముల నన్నిటిని, నీయందే = సర్వాధారమైన నీయందే, సమర్పించి = ధాతువ్యుత్పత్తిచే సమన్వయించి, భువిన్ = స్థానమందు. (భూమియందు) నిరుక్తము = నిరుక్తమను శాస్త్రమును, ఎవ్వాటన్ = అన్నివిధములచేతను, నీప్రామాణ్యంబునన్ = సర్వజీవులకు, నీయందగు విశ్వాసమును, దృఢంబున్ = తొలగకుండునట్లుగా, చేయున్ = ఒనర్చుచుండును.

శబ్దములోపల మాటుపడియున్న యథార్థమయిన యర్థమును వ్యుత్పత్తిచే వివరించి ప్రకటించుచు ప్రతి శబ్దమును మీపరముగా బోధించుచు నిరుక్తమును మిమ్మే నుతించుచుండును.

శా॥ ఆమూలాగ్రము సర్వశాఖలను నిత్యాచారసంపత్తి న
య్యేమార్గంబుల నిల్పుపొంటె విధులన్ వ్యాపింపఁగాఁజేసి ది
వ్యామోదంబగు కల్పకల్పకము నీ యాహ్లాదమౌఁగాదె దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా! హారహీరాకృతీ!

ప॥ ఆమూలాగ్రము - సర్వశాఖలన్ - ఈ - నిత్యాచారసంపత్తిన్ - అయామార్గంబులన్ - నిల్పుపొంటెన్ - విధులన్ - వ్యాపింపన్ - కాన్ చేసి - దివ్యామోదంబు - అగు కల్ప కల్పకము - నీయాహ్లాదము - ఔన్ - కాదు - ఎ.

ప్ర॥ ఆమూలాగ్రము, = మొదలు మొదలుకొని, సర్వశాఖలను, సర్వ=సమస్తమయిన, శాఖలన్ = ఋక్శాఖయజుశ్శాఖ మొదలయిన తెగ లయందు, నిత్యాచార సంపత్తిన్, నిత్య = చెడని, ఆచార = మంచి యాచరణము యొక్క, సంపత్తిన్ = సంపదను, అయామార్గమ్ములన్ = ఆయాత్రోవలయందు, నిల్పుపొంటెన్ = నిలుపఁబెట్టుటకొఱకు, విధులన్ = శాస్త్రీయములయిన నియమములను, వ్యాపింపఁగాన్ = వ్యాపించునట్లు, చేసి = చేసి, దివ్యా మోదంబు, దివ్య = ప్రకాశించు, ఆమోదంబు = సంతోషమును కలిగించునది అగు, కల్ప కల్పకము = కల్పవృక్షమువలె. సంకల్పసిద్ధి గలిగించు కల్పశాస్త్రము, నీయాహ్లాదము = నిన్ను సంతోష పెట్టునది ఔఁగాదె = అయియున్నది కదా.

వరుస తప్పకుండ నాయాశాఖీయుల సదాచారము లిట్లనివిధించి కర్మ కాండమును కాపాడుచు లోకములకు సుఖముకల్పించు కల్పమును శాస్త్ర మును మిక్కిలి పొగడుచుండును.

శా॥ శ్రీమించు ల్కల నిల్వుటద్దమున మూర్తిస్ఫూర్తులట్టుల్ జగ
ద్వ్యామిశ్రంబగు జీవికర్మము గ్రహవ్యావృత్తి బోధించుచున్
నీమన్కిందగు జ్యోతిషంబు తెలుపున్ నీసాక్షిభావంబు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా ! హారహీరాకృతీ!

ప॥ శ్రీ మించుల్ - కలనిల్వుటద్దమునన్ - మూర్తిస్ఫూర్తులు - అట్టుల్ - జగద్వ్యామిశ్రంబు - అగు జీవికర్మమున్ - గ్రహవ్యావృత్తిన్ - బోధించుచున్ - నీమన్కిన్ - తగు జ్యోతిషంబు - తెలుపున్ - నీసాక్షిభావంబున్

ప్ర॥ శ్రీమించుల్, శ్రీ = కాంతియొక్క, మించుల్ = వెలుఁగులు, కల నిల్వుటద్దమునన్ = ఒప్పుచున్న రత్నవికారమయిన యద్దమునందు, మూర్తిస్ఫూర్తులట్టుల్, మూర్తి = ఎదుటనున్న వివిధములయిన విగ్రహములయొక్క, స్ఫూర్తులట్టుల్ = స్ఫురణలువలె, జగద్వ్యామిశ్రంబు, జగత్ = పదునాల్గు భువనములయందును, వ్యామిశ్రంబు = పుణ్యము, పాపమను రెంటితోఁ గూడి ప్రత్యక్షముగాకయుండి, అగు జీవికర్మమున్, అగు = ఒప్పుచున్న, జీవి = ఎనుబదినాల్గులక్షల రకముల ప్రాణులయొక్క, కర్మమున్ = వెనుకటి జన్మమందలిది రాఁబోవుజన్మమందలిది యగు నాచరణమును, గ్రహవ్యావృత్తిన్, గ్రహ = సూర్యుఁడు మొదలయిన గ్రహములయొక్క, వ్యావృత్తిన్ = అశ్విని మొదలయిన నక్షత్రముల సంబంధము కల మేషము మొదలయిన పండ్రెండురాసుల యందుగల సంచారముచే, బోధించుచున్ = తెలియఁజేయుచు, నీమన్కిన్ = నీయొక్క యాధారముచే, తగు జ్యోతిషంబు = నిలిచియున్న జ్యోతిశ్శాస్త్రము (ఖగోళభూగోళ సంబంధమును తెలియఁజేయునది,) నీసాక్షిభావంబు, ని = నీయొక్క, సాక్షిభావంబున్ = అన్నిఁటిని కనిపెట్టియుండుటను, తెలుపున్ = తెలియజేయుచుండును.

మిక్కిలి స్వచ్ఛమయిన నిలువుటద్దమునందు నెదుటనున్నవి గ్రహింపఁబడునట్లు సర్వజీవుల పుణ్యపాపములను జాతకచక్రమున నవగ్రహ సంచారము వలన తూ. చా, తప్పక ప్రబోధింపఁజాలిన జ్యోతిషమును మిమ్ము ప్రార్థించుచుండును.

శా॥ నేమంబొప్పఁగమాత్రలున్ గురువులున్నిండన్గణమ్ముల్మహా
శ్రీమాన్యంబులువృత్తముల్ వెలయఁగాఁద్రిష్టుమ్ముఖమ్ముల్సదా
ధీమల్లి న్విరియించు ఛందమును వర్ధిష్ణుత్వ సంపాది దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ ।

ప॥ నేమంబు - ఒప్పఁగ - కఁ - మాత్రలుఁ - గురువులుఁ - నిండఁ - గణమ్ముల్ - మహా శ్రీమాన్యంబులు - వృత్తముల్ - వెలయఁ - గాఁ - త్రిష్టుమ్ముఖమ్ముల్ - సదా - ధీమల్లిక్ - విరియించుఛందముఁ - వర్ధిష్ణుత్వ సంపాది.

ప్ర॥ నేమంబు=నియమము, ఒప్పఁగఁ, ఒప్పుచుండునట్లు, మాత్రలుఁ= లఘువులు (కుఱుచలు) గురువులుఁ - దీర్ఘాక్షరములు (పొడుపైనవి; వత్తులతోఁ గూడినవి. పూర్ణబిందువుతోఁ గూడినవి) ను, నిండుఁ = పద్యము నందంతటను క్రమ్మకొని యుండునట్లును. మహా శ్రీమాన్యంబులఁ, మహా = గొప్పదైన, శ్రీ = కళావిశేషముచే, మాన్యంబులు = పూజింపఁదగిన, త్రిష్టుమ్ముఖమ్ముల్ = త్రిష్టుప్పు మొదలయిన, వృత్తముల్ = పద్యములుగాఁ, వెలయఁగాఁ = ఒప్పుచుండఁగా, ధీమల్లిఁ = బుద్ధి విశేషమను మల్లెతీవియను, విరియించుఛందము = పూలతోనిండునట్లు చేయఁగల ఛందశ్శాస్త్రము, సదా = ఎల్లప్పుడు, వర్ధి + ష్ణుత్వ సంపాది వర్ధిష్ణుత్వ = వక్తపఠిచునప్పుడు మిక్కిలి యింపుగా నుండుటచే వినువారికి మహానందము వృద్ధిచేయు స్వభావమును, సంపాది = కలిగించుచున్నది.

భగ్నములను శ్రోత శ్రద్ధగలిగి చెవియొగ్గి వినుటకాసక్తి నెలకొల్పుటకై గణ యతిప్రాసాదులయిన నియమముల రకరకములయిన వృత్తముల గేయములుగా కూర్చి సర్వజీవులకు మహానందము గలిగించు ఛందశ్శాస్త్రమును మిమ్మే స్తోత్రించుచుండును.

శా॥ భూమిన్ ద్యోతలమందునం జెలగు జీవుల్పుట్టుటల్ పుట్టితా
మే మాద్రింజరియింపఁగా వలయునో. యేజీవికాహారమె
ట్లోమేలోషధులెట్లొ సర్వమునుదెల్పున్ఋక్కు-నీయూర్పు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ భూమిన్ - ద్యోతలమందునన్ - చెలఁగు జీవుల్ - పుట్టుటల్ -
పుట్టి - తాము - ఏమాద్రిన్ - చరియింపన్ - కాన్ - వలయున్
ఓ - ఏ జీవికి - ఆహారము - ఎట్లు - ఓ - మేలోషధులు - ఎట్లు - ఓ -
సర్వమున్ - ఈ - తెల్పున్ - ఋక్కు - నీయూర్పు - దుర్గా - మల్లేశ్వర -
సర్వదేవపరివారా - హారహీరాకృతీ -

ప్రి॥ భూమిన్ = భూమియందును, ద్యోతలమందునన్ = అస్వర్గము
నందును, చెలఁగుజీవుల్ = ఒప్పుచున్న ప్రాణికోట్లు, పుట్టుటల్ = జన
నముఁజెందు ప్రకారమును, తాము = ఆ సమస్తప్రాణులును, పుట్టి =
జన్మించి, ఏ మార్గాన్ = ఏరీతిగా, చరియింపగా వలయునో = ప్రవర్తింప
వలయునో, ఏజీవికి = ఏ ప్రాణికి, ఆహారము = ప్రాణమునునిలుపునది,
ఎట్లో = ఏవిధమయినదో. మేలోషధులు = శ్రేయమయిన పైరులు
తరు గుల్మ లతాదులు, ఎట్లో = ఏదిదేని కుపయోగించునో, సర్వమును =
అవిషయము లన్నింటిని. నీయూర్పు = నీవలనఁ బేర్పడిన ఊపిరి, ఋక్కు =
ఋగ్వేదము, తెల్పున్ = తెలియఁజేయు చుండును,

స్వేదజములు (పురుగులు) అండజములు (పక్షులు మొదలైనవి) ఉద్భి
జ్జములు) (చెట్లు - పర్వతములు) జరాయుజములు (మనుజులు - మృగములు)
అను నాల్గు విధములయిన జీవకోట్లు ప్రవర్తించుట. వానికి వలయు నాహార
ములు. ఓషధులు (ధాన్యపు పైరులు చెట్లు పెరిగిపండెడు విధానములు.
సర్వమును దెలియఁజేయుచు మీయాధారమునఁ బ్రవర్తించు ఋగ్వేదము
మిమ్మే కొనియాడు చుండును.

శా॥ ద్యోమేది న్యనుబంధముం దెలుపు విధ్యుక్తాధ్వరశ్రేణి సు
త్రామాదుల్ తవియంగఁ జేయునది కర్మ బ్రహ్మరూపంబుగా
నామంత్రించు యజుస్సు సూక్ష్మముశిరంబ శ్రాంతమున్నిన్ను దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహారాకృతీ!

ప॥ ద్యోమేదిన్యనుబంధముఁ - తెలుపు విధ్యుక్తాధ్వరశ్రేణి - సుత్రామాదుల్ - తనియఁగ - కఁ - చేయునది - కర్మ - బ్రహ్మరూపంబు - గాఁ - ఆమంత్రించు యజుస్సు - సూక్ష్మము శిరంబు - అశ్రాంతముఁ - నిన్నుఁ -

ప్ర॥ ద్యో......ముఁ, ద్యో = స్వర్గముయొక్క, మేదినీ = భూమి యొక్క, అనుబంధముఁ = అన్యోన్యసంబంధమును, తెలుపు ......... శ్రేణి. తెలుపు = తెలియఁజేయునట్టి, విధి = శాస్త్రనియమములచే, ఉక్త = విధింపఁబడిన, అధ్వర = యజ్ఞములయొక్క, శ్రేణి = పరంపర, సుత్రామాదుల్, సుత్రామ = ఇంద్రుడు, అదుల్ = మొదలయిన దేవతల నందఱను, తనియంగఁ = తృప్తిపడునట్లుగా, చేయునది = చేయఁగల దనియు, కర్మ = పైజెప్పిన యజ్ఞములు మొదలయినది, బ్రహ్మరూపంబు గాఁ = నీ స్వరూపముగాను, సూక్ష్మము శిరంబు, సూక్ష్మము = లింగశరీరము యొక్క, శిరంబు = శిరస్సు (ప్రధానము) అయిన, యజుస్సు = యజుర్వేదము, అశ్రాంతముఁ = నిరంతరమును, నిన్నుఁ = జ్ఞానకర్మల కాధారమైన నిన్ను, ఆమంత్రించును = తెలియఁజేయుచుండును.

మనుష్యులొనరించు యజ్ఞముల యందలి హవిర్భాగము అందుకొని యింద్రాది దేవతలు పైరులు పెంచు వానల గురిపించుట యొటిగించుచు, కర్మ కాండము నీ స్వరూపముగాఁ దెలియఁ జేయుచు లింగశరీరమునకు శిరస్సు వంటిది యైన యజుర్వేదము నిన్ను స్తుతించుచుండును.

శా|| భూమాశ్చర్యకరంబులై తగి నభో భూభాగమున్నిండి సం
ధామూలమ్ముల నస్త్రశస్త్రముల మంత్రిస్వీయశక్తిన్ ఖల
స్తోమమ్మాపు నధర్వవేదమును నిన్. ధ్యానించు మోదించు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

వ|| భూమాశ్చర్యకరంబులు - ఐ - తగి - నభోభూభాగమున్ - నిండి - సంధామూలమ్ములన్ - అస్త్రశస్త్రములన్ - మంత్రిస్వీయశక్తిన్ - ఖల స్తోమమ్ము - అపు నధర్వవేదమున్ - ఉ - నిన్ - ధ్యానించున్ మోదించున్.

ప్ర|| భూ......బులు, భూమ = అధికమగున, ఆశ్చర్యకరంబులు = అద్భుతమును కలిగించునవిగా, ఐ = అగుచు, తగి = ఒప్పి, నభో...... గమున్, నభః=ఆకాశముయొక్క, భూ = భూమియొక్క, భాగమున్ - ప్రదేశమును, నిండి = వ్యాపించి, సంధామూలమ్ములన్, సంధా = ప్రతిజ్ఞలకు, మూలమ్ములన్ = కారణములయినయట్టి, అస్త్ర శస్త్రములన్, అస్త్ర= మంత్రము ప్రధానముగాఁగల వానిని, శస్త్రములన్ = లోహ ప్రధానములయిన వానిని (ఆయుధములను) మంత్రిస్వీయశక్తిన్, మంత్రి = మంత్రముల యొక్క, స్వీయ = స్వకీయమైన, శక్తిన్ = సామర్థ్యముచే, ఖలస్తోమంబు, ఖల = దుర్మార్గులయొక్క, స్తోమంబు = సమూహమును, అపు నధర్వవేదమును = అపునట్టి యధర్వవేదమును, నిన్ = నిన్ను, ధ్యానించున్ = నిలుకడతో భజించును, మోదించున్ = నిరంతరము సంతోషించుచుండును.

చూచువారి కాశ్చర్యము కలిగించు చిత్ర విచిత్రములయిన యస్త్రములు (మంత్రశక్తిచే సంభవించునవి) శస్త్రములు (లోహములచే నేర్పడునవి) తెలియఁజేయుచు దుష్టులను నశింపజేయుట కుపయోగించు నధర్వమును నిన్నే భజించుచుండును.

శా॥ పాముల్ జంతులు బాలకుల్ తనియ శ్రావ్యంబైన నీరూపు వీ
ణా మధ్యంబునఁదంత్రులందిరుగురాణంజూపిచొక్కించుచున్
సామంబెప్డును నీమహామహిమ విశ్వాసాత్మఁగీర్తించు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ పాముల్ - జంతులు - బాలకుల్ - తనియన్ - శ్రావ్యంబు - ఐన నీరూపు - వీణామధ్యంబునన్ - తంత్రులన్ - తిరుగురాణన్ - చూపి - చొక్కించుచున్ - సామంబు - ఎప్పుడున్ - నీ మహా మహిమన్ - విశ్వాసాత్మన్ - కీర్తించున్ -

ప్ర॥ పాముల్ = సర్పములు. జంతులు = పశువులు, బాలకుల్ = పసిపిల్లవాండ్రు, తనియన్ = తృప్తినొందునట్లుగా, శ్రావ్యంబు = వినఁదగినది, ఐన నీరూపు = అయినట్టి నీస్వరూపమును, వీణామధ్యంబునన్, వీణా = వీణయొక్క, మధ్యంబునన్ = నడిభాగమునందు, తంత్రులన్ = తీగెలయందు, తిరుగు రాణన్, తిరుగునట్టి పద్ధతిని, చూపి = ప్రకటించి, చొక్కించుచున్ = సర్వప్రపంచమును నిత్యానందముచేఁ కరఁగించుచు, సామము = సామవేదము, ఎప్డున్=ఎల్లవేళలయందును, నీ మహామహిమ = నీయొక్క గొప్పదయిన మహిమమును, విశ్వాసాత్మన్, విశ్వాస = నమ్మకముతోఁ గూడిన, ఆత్మన్ = హృదయముతో, కీర్తించున్ = గానరూపమునఁ గొనియాడుచుండును.

దృశ్యము (విగ్రహాదులు) శ్రావ్యము (వాగ్గేయరూపమైనది) అను మీరెండురూపములలో నొకటియైన గానము. పాములు. పశువులు. శిశువులు; విన్నంతన తలద్రిప్పించునట్టిది. దానిని వీణతీఁగలయందు మంత్రరూపమును మధురముగా వినఁజేయుచుఁ బ్రకర్తించు సామవేదమును మిమ్మే పాడుచుండును.

శా॥ సోముండై జనదృక్చకోరికల మెచ్చుల్ కోరికల్ దీర్చుచున్
వేమాఱున్ దృఢభక్తిలోఁ దలఁచు నీ విశ్వాత్మ మాహాత్మ్యమున్
సామోక్తిం గొనియాడు నిత్యమును పుచ్చాకోటయాఖ్యుండు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ సోముండు - ఐ - జనదృక్చకోరికల మెచ్చుల్ - కోరికల్ - తీర్చుచున్ - వేమాఱున్ - దృఢభక్తిన్ - లోన్ - తలఁచున్ - నీవిశ్వాత్మమాహాత్మ్యమున్ - సామోక్తిన్ - కొనియాడున్ - నిత్యమున్ - ఈ - "పుచ్చాకోటయాఖ్యుండు" - దుర్గా! మల్లేశ్వర! - సర్వదేవ పరివారా! - హారహీరాకృతీ -

ప్ర॥ సోముండు = పదియాఱు కళలునిండిన శరత్కాలచంద్రుఁడు, ఐ = అగుచు. జనదృక్........మెచ్చుల్, జన = ఎల్ల ప్రజలయొక్క, దృక్ = చూపులనెడు, చకోరికల = వెన్నెలపిట్టల యొక్క, మెచ్చుల్ = గొప్పవయిన, కోరికల్ = ఇష్టములను, తీర్చుచున్ = నెఱవేర్చుచు, వేమాఱున్ = మాటిమాటికి, దృఢభక్తిన్, దృఢ = నిలుకడగల. భక్తిన్ = భక్తిచే, నీవిశ్వాత్మ మాహాత్మ్యమున్, నీ = నీయొక్క, విశ్వాత్మ = విశ్వరూపముగానున్న. మాహాత్మ్యమున్ = గొప్పదనమును, పుచ్చాకోటయాఖ్యుండు, పుచ్చా = పుచ్చా వంశమునఁబుట్టిన, కోటయాఖ్యుండు = కోటయ్యయను పేరుగల నిజభక్తుఁడు. సామోక్తిన్ = ఇంపయిన పలుకుబడితో, నిత్యమున్ = నిరంతరమును, కొనియాడున్ = పొగడుచుండును.

పున్నమనాటి చంద్రుఁడు చకోరములను (వెన్నెల పిట్టలను) బలె జనుల కాహ్లాదముఁ గలిగించుచు, మనోభీష్టముల నెఱవేర్చుచు జలింపనిభక్తితో నెల్లవేళల విశ్వరూపమయిన నీమాహాత్మ్యమును మృదు మధుర పదముల "పుచ్చాకోటయ్య" యను నీనిజకరుణా సదనము కొనియాడుచుండును.

శా॥ భూమిన్ జీవుల జీవితంబును సతంబున్ బూతముంజేయ నౌ
గోమూర్తుల్‌కపిలాకృతుల్ వలయుకోర్కుల్గూర్పఁ బోషించు
చున్
శ్రీమాల్యంబులగొల్చుచుంద్రుమువురుంజిత్తమ్ములుప్పొంగదు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ భూమిన్ - జీవులజీవితంబున్ - ను - సతంబున్ - పూతమున్ - చేయన్ - ఔ - గోమూర్తుల్ - కపిలాకృతుల్ - వలయు కోర్కుల్ - కూర్పన్ - పోషించుచున్ - శ్రీమాల్యంబులన్ - కొల్చుచుంద్రు - మువురున్ - చిత్తంబులు - ఉప్పొంగన్ -

ప్ర॥ భూమిన్ = భూమండలమునందు, జీవులజీవితంబున్ = ప్రాణుల యొక్క జీవయాత్రను, సతంబున్ = ఎల్లవేళలయందును. పూతమున్ = పవిత్రమయిన దానినిగా, చేయన్ = చేయుటకు, ఔగోమూర్తుల్, ఔ = అయినటువంటి, గో = ఆవులయొక్క, మూర్తుల్ = స్వరూపములు, కపిలాకృతుల్ = నల్లనిమణిచాయవంటి యాకారముకలవి, వలయుకోర్కుల్ = కావలసిన మనస్సులోని కోరికలను, కూర్పన్ = సమకూర్చుచుండఁగా, పోషించుచున్ = వానిని భక్తిశ్రద్ధలతో రక్షించుచు, మువురున్ = పైచె ప్పబడిన మూగురునిజభక్తులును, చిత్తంబులు = మనస్సులు, ఉప్పొంగన్ = పైకి ఉబుకుచుండగా, శ్రీమాల్యంబులన్, శ్రీ = సంపదలతోఁ గూడుకొ నిన, మాల్యంబులన్ = పూలదండలతో, కొల్చుచుంద్రు = పూజించు చుందురు.

భూలోకమునఁగల జీవకోట్లను పవిత్రులను జేయఁజాలి కోర్కులు ఫలింపఁజేయు, కపిల ధేనువులనుమహానందముతో నీ మూవురు నిత్యము పూల దండలు వేసనిడి పూజించుచుందురు. క్షీరముల నిమ్మభిషేకించుచుందురు.

శా॥ నీమెచ్చందగు వారలందనుపుచున్ నిన్ బూలఁబూజించుచున్
నీమీదంగల కబ్బముల్ నలుగడన్ నిండించుచుంద్రచ్చుచున్
నీమంత్రంబు జపింతు రీమువురుబూన్కిన్ సర్వకాలంబుదు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ నీమెచ్చన్ - తగు వారలన్ - తనుపుచున్ - నిన్ - పూలన్- పూజించుచున్ - నీమీదన్ - కల కబ్బముల్ - నలుగడన్ - నిండించుచున్ - త్రచ్చుచున్ - నీమంత్రంబు - జపింతురు - ఈమూవురున్ - పూన్కిన్ - సర్వకాలంబున్ - దుర్గా! మల్లేశ్వర! సర్వదేవపరివారా! హారహీరాకృతీ!

ప్రి॥ నీమెచ్చందగు వారలన్ = నీవు మెచ్చుకోఁదగిన గుణగణము కల వారలను, తనుపుచున్ = తృప్తిపడఁజేయుచు, నిన్ = నీమూర్తిని, లోపల వెలపల నిండియున్నదానిని, పూలన్ = సుప్రసిద్ధములయిన పుష్పవిశేషముల చేత, పూజించుచున్ = త్రికరణశుద్ధిగా గుడినిలిపి పూజించుచు, నీమీదన్ = నీయంకితమునందు, కలకబ్బముల్ = ఉన్నటువంటి వాగ్రచనా విశేషములను, నలుగడన్ = నాలుగు దిక్కులయందు, నిండించుచున్ = నిండునట్లుగాఁ జేయుచు, త్రచ్చుచున్ = ఆరచనావిశేషములను పరామర్శించుకొనుచు, ఈమువురున్ = ఈప్రసిద్ధులయిన ముగ్గురు నిజభక్తులు నీమంత్రంబు = పతితులనుసయితము పవిత్రులనుజేయఁ జాలిన తారక మంత్రమ్మును, జపింతురు = నియమముతో క్షణమేనియు వదలక జపము చేసికొనుచుందురు.

మీకు నచ్చిన భక్తులకు సంతృప్తిఁ గలిగించుచు మీయంకితమౌకలపుస్తకముల నెల్ల యెడల వ్యాపింపఁజేయుచు వానిలోఁగల విశేషముల నొకరి కొకరు తలచి తలచి చెప్పుకొనుచు మీ మంత్రమును సదా జపించుచుందురు.

శా॥ నీమూలంబుననే సమస్తజగముల్ నిర్నిద్రతం గాంచుటల్
నీమాహాత్మ్యమె పండువెన్నెలవలెన్ నీరంధ్రమైనిండుటల్
నీమించే జగమౌటలీమువ్వురు లో నేర్పొప్ప భావింత్రు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ నీమూలంబునన్ - ఏ - సమస్తజగముల్ - నిర్నిద్రతన్ - గాంచుటల్ - నీమాహాత్మ్యము - ఎ - పండువెన్నెలవలెన్ - నీరంధ్రము - ఐ - నిండుటల్ - నీమించు - ఏ - జగము - ఔటలు - ఈమువ్వురున్ - లోన్ - నేర్పు - ఒప్పన్ - భావింత్రు.

ప్ర॥ నీమూలంబుననే = నీయాధారముచేతనే, సమస్త జగముల్ = పదునాలుగు భువనములును, నిర్నిద్రతన్ = నిరంతరము నిత్యానిత్య విచారణచే జాగ్రత్తకలిగియుండుటను, నీమాహాత్మ్యమే = నీ గొప్పదయిన ప్రభావమే, పండువెన్నెలవలెన్ = శరత్కాలమందలి పదియారుకళలతో నిండిన పండువెన్నెలరీతి, నీరంధ్రమై = క్రిక్కిఱిసినదై, నిండుటల్ = వ్యాపించియుండుటను, నీమించే = పరిశుద్ధము సర్వోత్కర్షమును నౌ నీ ప్రకాశమే, జగము = వివిధములయిన యాకారములతో మిక్కిలి యాశ్చర్యము కలిగింపఁజాలిన సర్వప్రపంచముగాఁ గన్పించుటను, ఈమువ్వురు = ప్రసిద్ధులయిన ముగ్గురు నిజభక్తులు, నేర్పు = శాస్త్రవచనమునకు యుక్తికిని సరిపడురీతి, ఒప్పన్ = ఒప్పునట్లు, భావింత్రు = తలంచుచుందురు.

మఱియు మీయాధారముచేతనే సమస్తలోకములు మేల్కొనుచున్నవనియును, శరత్కాలమునాటి పూర్ణచంద్రికవలె మీ మహత్తు సర్వదేశము నిండియున్నదనియును, మీ తేజస్సు ప్రపంచరూపముగఁ గన్పించుచున్నదనియు నీ ముప్వురు విమర్శచే నిరంతరమును తెలియుచుందురు.

శా॥ బాముల్వేలకొలంది యెత్తి భువినంపాదించుకొన్నట్టి మే
లౌ మానుష్యఫలంబునిన్ దెలియుటే యంచున్ సదా యెంచుచున్
ప్రామాణ్యంబునఁ గొల్చుచుంద్రు మువురున్ బాహ్యాంతరా
వృత్తి దు
రామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ బాముల్ - వేలకొలంది - ఎత్తి - భువిన్ - సంపాదించు కొన్నట్టి - మేలౌ మానుష్యఫలంబు - నిన్ - తెలియుట - ఏ - అంచున్ - సదా - ఎంచుచున్ - ప్రామాణ్యంబునన్ - కొల్చుచుంద్రు - మువురున్ - బాహ్యాంతరావృత్తిన్ -

ప్ర॥ బాముల్ = పుట్టుకలు, వేలకొలంది = లెక్కించుట కలవిగాని వానిని, ఎత్తి = పొంది, భువిన్ = మనుష్య లోకమునందు, సంపాదించు కొన్నట్టి = కలుగఁజేసికొని నట్టివియు, మేలు = మంచిదియును, ఔ = అగునట్టి, మానుష్య = మానవ జన్మము యొక్క, ఫలంబు - ప్రయోజనము, నిన్ = నీస్వరూపమును, తెలియుటే = విపరీతముగాఁగాక యున్నదున్నట్లు తెలిసికొనుటయే, అంచున్ = అనుచు, సదా = ఎల్లవేళలయందును, ఎంచుచున్ = తలపోయుచు, ప్రామాణ్యంబునన్ = ప్రమాణబుద్ధితో, మువురున్ = పైఁజెప్పఁబడిన నిజభక్తులు ముగ్గురును, బాహ్యాంతరావృత్తిన్, బాహ్య = వెలుపల, అంతర = లోపలనునైన, అవృత్తిన్ = పరామర్శతో, కొల్చుచుందురు, భజించుచుందురు.

అనేక శరీరములు ధరించి ధరించి తాను పుణ్యవిశేషముచే భూమండలమున మనుష్యుఁడై పుట్టినందుకు ప్రయోజనము వెలుపల లోపల మీరిరువురు నిండియుండుట తెలిసికొనుటయే యని భావించుచు ప్రమాణబుద్ధితో మువ్వురు సేవించుచుందురు.

శా॥ సామేనై యలకోటయాఖ్యునకు భాషాదేవియు న్మెచ్చనా
శ్రీ మేధానిధియై గుణప్రితతికిం జెల్వొందులేఁదీవెయై
రామారత్నము కొల్చు నిన్ కనకదుర్గాంబాయశఃపేటి దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ సామేను - ఐ - అలకోటయాఖ్యునకున్ - భాషాదేవి - ఉన్ - మెచ్చన్ - ఔ - శ్రీ - మేధానిధి - ఐ - గుణప్రితతికిన్ - చెల్వు-ఒందులేఁ దీవె - ఐ - రామారత్నము - కొల్చున్ - నిన్ - కనకదుర్గాంబాయశఃపేటి.

ప్ర॥ అలకోటయాఖ్యునకున్, అల= ప్రసిద్ధుఁడయిన, కోటయాఖ్యునకున్ = ఆ కోటయ్యయను నామముకల నిజభక్తునకు, సామేనై = సగము శరీరమయి, భాషాదేవియున్ = సరస్వతీదేవియును, మెచ్చనౌ = మెచ్చుకోఁదగిన, శ్రీ మేధానిధియై, శ్రీ = అప్పటికప్పుడు తలయు విషయములను స్ఫురింపఁజేయు వాక్సంపదగల, మేధానిధియై, మేధా = బుద్ధివిశేషమునకు, నిధియై = గనియైనట్టిదై, గుణ ప్రితతికిన్, గుణ = సద్గుణములయొక్క. ప్రితతికిన్ = సమూహమునకు (గుణములను పుష్పసమూహమునకు) చెల్వు= అందము, ఒందు = పొందునట్టి, లేఁదీవెయై = లేత తీగెయైనటిదయి, రామారత్నము, రామా=స్త్రీ సమూహమునందు, రత్నము = శ్రేష్ఠురాలగు, కనకదుర్గాంబా యశఃపేటి, కనకదుర్గాంబా = కనకదుర్గాంబయను పేరుగల, యశఃపేటి = నీకీర్తిని భద్రపఱచునట్టిది. నిజభక్తురాలు. నిన్ = నిన్ను, కొల్చున్ = త్రికరణములతో సేవించుచుండును.

ఆ పుచ్చా కోటయ్యయను భక్తున కర్ధాంగియై సరస్వతిమెచ్చఁ దగిన భాషా ప్రావీణ్యము కలిగి గుణములను తావిపూవులకు లేఁదీవయై స్త్రీలకు శిరోమణియైన "పోషిత కనకదుర్గాంబ" సర్వదా మిమ్ము భజించుచుండు.

శా॥ శ్రీమంతంబగు బేతపూడి కులవార్ధిం జంద్రుఁడై ధీబల
స్థేమాకారము నామముం దలఁచి దుశ్చిత్తుల్ భయంబంద నీ
స్వామిత్వమ్ము గణించు వీరశరభ ప్రఖ్యుండు నిత్యంబు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ శ్రీమంతంబు = అగు బేతపూడి కులవార్ధి - చంద్రుఁడు ఐ - స్థేమాకారము - నామమున్ - దలఁచి - దుశ్చిత్తుల్ - భయంబు-అందన్- నీ స్వామిత్వంబున్ - గణించున్ - వీరశరభ ప్రఖ్యుండు - నిత్యంబున్ -

ప్ర॥ శ్రీమంతంబు - సర్వసంపదలు సంపూర్ణముగా గలది, అగు బేతపూడి కులవార్ధిన్, అగు = అయినటువంటి, బేతపూడి కుల = బేతపూడి యను పేరుగల వంశమను, వార్ధిన్ = పాలసముద్రమునందు, చంద్రుడై = శరత్కాల పూర్ణిమా చంద్రుడయి, స్థేమా కారము. స్థేమ = ధీరత్వముచే నిలుకడగల, ఆకారము = స్వరూపమును, నామమున్ = సింహములకు గూడ జంకు కలిగింపఁగల పేరును తలఁచి = స్మరించి, దుశ్చిత్తుల్ = చెడ్డతలంపు గలవారు, భయంబు = భయమును, అందన్ = చెందుచుండఁగా, నిత్యంబు = ఎల్లప్పుడును, వీరశరభ ప్రఖ్యుండు= వీరశరభయ్యయను పేరుగల, నిజభక్తుడు, నీ స్వామిత్వము = ఎల్లలోకములయందు నెల్లవారలయందు నీవే ప్రభుడయి యుండుటను, గణించున్ = ఎల్లచోట్ల నెల్లసభలయందును నియమముగాఁ బేర్కొనుచుండును.

సిరులుగల బేతపూడి వంశమను పాలసముద్రమునకు చంద్రుఁడై, చుఱుకయిన బుద్ధిబలమును తెలియఁజేయు తనపేరు దలఁచుకొన్నంత దుష్టులకు భయముకలుగ సర్వకాలము సర్వులకు మీరే ప్రభువులుగా "వీరశరభయ్య" యను భక్తవీరుఁడు భావించుచుండును ప్రబోధించుచుండును.

శా॥ నీమూర్తింగనుదోయి గప్పురముగా నీపాదసంస్పర్శమున్
మైమీదన్ హరిచందనమ్ముగను నామమ్మున్ మరందమ్ముగా
నీమూవుర్తలపోయుచుందు రెద హాయిన్నిత్యమున్ భక్తిదు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ !

ప॥ నీమూర్తిన్ - కనుదోయిన్ - కప్పురము - గాన్ - నీపాద సంస్పర్శమున్ - మైమీదన్ - హరిచందనమ్మున్ - కన్ - ను - నామమ్మున్ - మరందమ్ము - గాన్ - ఈమూవుర్ - తలపోయుచుందురు - ఎదన్ - హాయిన్ - నిత్యమున్ - భక్తిన్ -

ప్ర॥ నీమూర్తిన్ = నీస్వరూపమును, కనుదోయిన్ = రెండుకన్నులయందు, కప్పురముగా = పచ్చకర్పూరమువలెను, నీపాదసంస్పర్శమున్, నీపాద = నీచరణముల యొక్క, సంస్పర్శమున్ = సోకుటను, మైమీదన్, శరీరమునందు, హరిచందనమ్ముగను = మంచిగందపుఁ బూతవలెను, నామమ్మున్ = నీనామమును, మరందమ్ముగాన్ = పూఁదేనెవలెను, ఈ మూవుర్ = పుచ్చాకోటయ్య పోషితకనకదుర్గాంబ, చేతపు డి వీరళ-భయ్య యను నామములుగల యీ ముగ్గురును; ఎదన్ = హృదయారవిందములందు, భక్తిన్ = భక్తి విశేషము చేత, హాయిన్ = సుఖస్వరూపమును, నిత్యమున్ = దేశకాలాదిభేదములవలనఁ గలుగు వికారములు చెందక యెల్ల వేళలయందు నొక్కటిగా నుండు నిన్ను, తలపోయుచుందురు = మిక్కిలిగా భావించుచుందురు.

ఈ మువ్వురు భక్తులును మీ స్వరూపసందర్శనము కన్నులను పచ్చ కప్పురము గాను మీపాదములను స్పృశించుట మంచిగందపుఁ బూఁతగాను నాలుకయందు మీ నామస్మరణము పూదేనియ సోనగాను నిరంతరమును భావించుచుందురు.

శా॥ నేమంబొప్పఁగ వేదరూపముననో నీశాసనంబందు నీ
వేమార్గంబులఁ జూపినావొ యటహాయింగాంచుచున్నిత్యముఁ
వేమాఱుంగనుచుందురీమువురు భావిం తో౯ి సేవింత్రు దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా! హారహీరాకృతీ!

ప॥ నేమంబు - ఒప్పఁగ - కఁ - వేదరూపమునఁ - ఓ నీశాసనంబందుఁ - నీవు - ఏమార్గంబులఁ - చూపినావు - ఓ - అటన్ - హాయిన్ - కాంచుచున్ - నిత్యమున్ - వేమాఱున్ - కనుచుందురు - ఈమువురున్ - భావింతు౯ి - ఓలిన్ - సేవింతు౯ి.

ప్ర॥ నేమమ్ము = నియమము, ఒప్పఁగన్ = ఒప్పుచుండఁగా, వేదరూపమునన్ = వేదమను పేరుగల నీ స్వరూపమునందు, నీవు = ఈవు, ఏమార్గమ్ములన్ = ఎటు తో౯ివలను (భక్తులను సంసారమను సంకెలయందు చిక్కుపడనీయనివానిని) చూపినావో = భక్తిజ్ఞానవైరాగ్య ప్రధానముగాఁ బ్రకటించితివో, అటన్ = అనీచూపిన తో౯ివలయందు; హాయిన్ = చెప్పినట్లాచరించుటచే సుఖమును, కాంచుచున్ = పొందుచు, నిత్యముఁ = ఎల్లప్పుడును, నిత్యస్వరూపముకల నిన్ను, ఈ మువురున్ = పైజెప్పఁబడిన ఈముగ్గురు నిజభక్తులును, ఓలిఁ = క్రమముగా, వేమాఱుఁ = పలుమార్లు, కను చుందురు = గుర్తించుచుందురు, భావింత్రు = హృదయమునందు నిలుపుచుందురు. సేవింతు౯ి = సేవించుచుందురు.

వేదమునందు మీరు శాసించిన ధర్మము లాచరించును వానందము ననుభవించుచు నెల్లవేళలయందు నీమువ్వురు నిత్యమును మిమ్ము జూచుచుందురు. భావించుచుందురు. సేవించుచుందురు.

శా॥ తామార్జించిన సంపదం దెలిసి శ్రద్ధాళుల్ గుణాంభోనిధుల్
భూమానందము నీయనుగ్రహము సంపూర్ణమ్ముగా దానధ
ర్మామేయమ్ముగ కోటవీరశరభ ప్రాజ్ఞుల్ సమర్పింతురు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ తాము - ఆర్జించిన సంపదన్ - తెలిసి - శ్రద్ధాళుల్ - గుణాంభోనిధుల్ - భూమానందము - నీయనుగ్రహము - సంపూర్ణమ్ము - కాన్ - దాన ధర్మామేయమ్ము - కన్ - కోటవీరశరభప్రాజ్ఞుల్ - సమర్పింతురు

ప॥ తాము = ధనికులును, ఆర్జించిన సంపదన్ = సంపాదించి నట్టి ధనమును, తెలిసి = మంచిచెడ్డలను తారతమ్యములను గుర్తెరింగి, శ్రద్ధాళుల్ = సత్కార్యములను సలుపుటయందు నిత్యమయిన యాసక్తి కలవారును, గుణాంభోనిధుల్ = ఔదార్య ధైర్యాదిగుణములకు సముద్రమువంటి వారునగు, కోట వీరశరభప్రాజ్ఞుల్ = "పుచ్చా కోటయ్య" "బేతపూడి వీరశరభయ్య" యను నిజభక్తులు, భూమానందము = మిక్కిలి యానందమును కలిగించునటువంటి, నీయనుగ్రహము = నీప్రసాదము, సంపూర్ణము = నిండైనది, కాన్ = అగునట్లు, దాన......మ్ము, దాన = పాత్రతయెఱింగి యిచ్చుటచేతను, ధర్మ = నిజధర్మ మాచరించుటచేతను, అమేయమ్ము = పోలికలేనిది, కన్ = అగునట్లు, సమర్పింతురు = ఒసంగుచుందురు.

పుణ్యకార్యముల శ్రద్ధగలవారును సద్గుణములకు గనులునునగు నీము-గ్గురు తమ ధనసంపదలను (సర్వస్వమును) మీరు మెచ్చుకొనునట్లు దాన-ధర్మముల కుపయోగించుచుందురు.

శా॥ శ్రీమద్వ్యాసకృతోపదేశమున వర్ధిష్ణుండు గాండీవి మె
ప్పౌ మాహేంద్రగిరిం దపంబునను గయ్యమ్మందు మెప్పించి నీ
ధామమ్మున్ నిజనామధేయమున సార్థంబౌనటుల్ సల్పె దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ శ్రీమద్వ్యాసకృతోపదేశమునన్ - వర్ధిష్ణుండు - గాండీవి - మెప్పు - ఔ మాహేంద్రగిరిన్ - తపంబునన్ - ఉ - కయ్యంబందు - మెప్పించి - నీధామమ్మునన్ - నిజనామధేయమునన్ - సార్థంబు - ఔనటుల్ - సల్పెన్ -

ప్ర॥ శ్రీ..................నన్, శ్రీమత్ = మేలును గలిగించునది యగుటచే సంపదకలదియగు, వ్యాస = వేదవ్యాస మహర్షి చేత, కృత = చేయబడిన, ఉపదేశమునన్ = మంత్రబోధన చేత, వర్ధిష్ణుండు = సహజముగా వృద్ధి చెందు స్వభావముకల, గాండీవి = తాత్రిలాంఛనముగా దుష్టశిక్షణ శిష్టరక్షములకై గాండీవ మను ధనుస్సును ధరించిన యర్జునుఁడు, మెప్పు = మెచ్చుకోదగిన, ఔ మాహేంద్రగిరిన్ = అయిన ఇంద్రకీల పర్వతమునందు, తపంబునన్ = తపస్సునందును, కయ్యంబందు = యుద్ధమునందును, మెప్పించి = మెచ్చుకొనునట్లుచేసి, నీధామమ్మునన్ = పరీక్షకై వరాహమును కల్పించి దానికొఱకైన మల్లయుద్ధమునందు జయింపఁగలిగియు భక్తుఁడని యర్జునునకే గెలుపొసంగిన స్థానమును, నిజనామధేయమునన్ = తనపేరితోనే (విజయవాడ యను పేరితోడనే), సార్థంబు = అర్థముతోఁగూడిన దానినిఁగా సల్పెన్ = చేసెను.

మహానుభావుఁడైన వేదవ్యాసుని యుపదేశముచే విజయుఁడను పేరుగల యర్జునుఁడు సహజవృద్ధికలవాఁడు తానింద్రకీల పర్వతప్రదేశమునందు తపోనిష్ఠచే మల్లయుద్ధమునందు మిమ్ము మెప్పించి పాశుపత మను మహాస్త్రమును బడయుటచే విజయవాఁడ (బెజవాడ) యను మీస్థానము సార్థకమయినది.

శా॥ ఏమేనిం బొనరించు నీచముల మాయించుఁ మహౌదార్యమున్
కామించుఁ జెడుతిండి దుర్లభములెక్కాలంబుఁ జింతించు నీ
యేమీ చిత్రము చిత్రముం గొలుపుఁ క్షుత్తృష్ణల్ దయాసాంద్ర దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ।

ప॥ ఏమేనిన్ - పొనరించున్ - నీచములన్ - మాయించున్ - మహౌదార్యమున్ - కామించున్ - చెడుతిండి - దుర్లభములు - ఎక్కాలంబున్ - చింతించున్ - నీ - ఏమీ - చిత్రము - చిత్రమున్ - గొలుపుఁ - క్షుత్తృష్ణల్ - దయాసాంద్ర!

ప్ర॥ దయాసాంద్ర = దయతో నిండినతల్లీ! తండ్రీ!, క్షుత్తృష్ణల్ = ఆకలి దప్పికలు, నీచములఁ = పనికిమాలిన పనులను, ఏమేనిన్ = ఎటువంటివానినైన, పొనరించున్ = చేయుటకు వెను కాడదు, మహౌదార్యమున్ = గొప్పదైన వితరణగుణమును, మాయించున్ = నశింపఁజేయును, చెడుతిండి = ఆరోగ్యమును చెడగొట్టు, చిఱుతిండిని, కామించున్ = ఎల్లవేళలయందును కోరుచుండును, ఎక్కాలంబుఁ = సర్వకాలము, దుర్లభములు = అనుభవించుటకు వీలుపడని పదార్థములను, చింతించుఁ = మంత్రము మాదిరిగా పలుమార్లు విచారించుచుండును. నీ = నిక్కాలి నిందింపదగినవి. ఏమీచిత్రము = ఎంత ముచ్చటయు, చిత్రమున్ = కంటికి బొమ్మలవలె, గొలుపున్ = ఆశ్చర్యమును కలిగించును.

ఆకలిదప్పికలు పొట్టనింపుకొనుటకై చేయరానిపనులను జేయించును. ఉదారభావమును నశింపఁజేయును. ఆరోగ్యము నెంతయేని విచారింపక తినరాని పదార్థములనుగూడ దినిపించును. సర్వకాలము దనకు లభించుటకు వీలుకాని వస్తువులను గోరుచుండును.

శా॥ భూమింగల్గినజీవికెప్డు దివిషద్భోగమ్ముపై, వారికిన్
భూమిశ్రీపయిబుద్ధి, గొల్పుచు జరం బూర్ణాత్మయై యింద్రియ
గ్రామమ్మున్ కురియించుఁగామ మకటా రాదయ్యెనిన్గొల్వ దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా ! హారహీరాకృతీ!

ప॥ భూమిన్ - కల్గినజీవికి - ఎప్డున్ - దివిషద్భోగమ్ముపై - వారికిన్ - భూమిశ్రీపయిన్ - బుద్ధిన్ - గొల్పుచున్ - జరన్ - పూర్ణాత్మ - ఐ - ఇంద్రియగ్రామంబున్ - కురియించున్ - కామము - అకటా - రాదు - అయ్యెన్ - నిన్ - గొల్వన్ -

ప్ర॥ కామము = కోరిక, భూమిన్ = భూమియందు, కల్గినజీవికి = ఒప్పుచున్న ప్రాణికి, ఎప్డున్ = సర్వకాలమును, దివిషద్భోగమ్ముపై = స్వర్గలోకమందలి సుఖముల ననుభవించుట యందును, వారికిన్ = ఆదేవతలకు, భూమిశ్రీపయిన్ = భూమండల మందలి సంపదలమీదను, బుద్ధిన్ = మనస్సును, గొల్పుచున్ = కలిగించుచు, జరన్ = ముసలితనమందు, పూర్ణాత్మయై = సంపూర్ణమయిన యవయవపుష్టికలదై, ఇంద్రియ గ్రామమ్మున్ = ఇంద్రియసమూహమును, కురియించున్ = మిక్కిలి కృశింపఁ జేయును, అకటా ! = విచారము కలిగించును, కానీ, నిన్ = నీమూర్తిని, గొల్వన్ = పూజించుటకు, రాదయ్యెన్ = రాకుండును.

కోరిక భూమియందుపుట్టిన ప్రాణులను, దేవలోక భోగములకును, దేవలోకము లోని వారలను, భూలోకమునందలి భోగములకును పరుగులెత్తించును. ముసలితనమందు మిక్కిలి యెక్కువయై పీల్చి పిప్పిచేసి మాఱు రూపు పడఁజేయును. కాని మనుజులకు మీ దర్శనాదులయందాసక్తిని గలిగింపదు.

శా॥ పాముంబోలుచు బుస్సఁగొట్టుఁబులిఠేవన్ బిట్టుగాండ్రిల్లుసం
గ్రామక్షోణి విహారముంసలుపు యుక్తాయుక్తశూన్యంబు హిం
సామేయంబగుఁగాని క్రోధ మతిదుష్టం బెన్నదింతైన దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ పామున్ - పోలుచున్ - బుస్సగొట్టున్ - పులిఠేవన్ - బిట్టు - గాండ్రిల్లున్ - సంగ్రామక్షోణిన్ - విహారమున్ - సలుపున్ - యుక్తాయుక్తశూన్యంబు - హింసామేయంబు - అగున్ - కాని - క్రోధము - అతిదుష్టంబు - ఎన్నదు - ఇంత - ఐనన్

ప్ర॥ క్రోధము = కోపము. పామున్ = సర్పమును, పోలుచున్ = సమాన ధర్మమునకు సరిపోవును, పులిఠేవన్ = పెద్దపులిమాదిరిగా, బిట్టు = మిక్కిలి భయముగలుగునట్లుగా, గాండ్రిల్లున్ = కర్ణకఠోరమయిన ధ్వనిని జేయుచుండును, సంగ్రామక్షోణిన్ = యుద్ధభూభాగమందు, విహారమున్ = స్వేచ్ఛాసంచారమును, సలుపున్ = ఆచరించుచుండును, యుక్తాయుక్తశూన్యంబు, యుక్త = మంచియగుదానిని, అయుక్త = చెడ్డయగు దానిని గూర్చి, శూన్యంబు = విచారణలేనిదై యుండును, హింసామేయంబు, హింసా = చంపుటయందు, అమేయంబు = పోలికలేనిదై యుండును. అతిదుష్టంబు = చంపుటయే పరమావధిగాఁ గలది కావున మిక్కిలి చెడ్డది, అగుంగాని = ఐయుండుటతప్ప, ఇంతైనన్ = కొంచెమైనను, ఎన్నదు = మీస్వరూపమును తలచుటగాని, మీ నామమును వినుటగాని విచారింపదు.

రూపము (చేయరానిపనుల నివారించుటకై యేర్పడినది) పామర జనమందు ప్రవేశించి పామువలె నిర్నిమిత్తముగా బుసలుకొట్టించును. పులి వలెఁజూచునంతనే యడలుపుట్టించును. పోరాటములందు జెలరేగును. మంచి చెడ్డల నేమాత్రము విచారింపనీయదు. ఎప్పుడును చంపుటకంటె నెక్కువయి నది యేది యని తారాడుచుండును.

శా॥ సామర్థ్యంబు దలంపదింతయిన విశ్వాసంబుపోకార్చు హే
లామందస్మిత ధైర్యసాహసికతా లజ్జాభిమానాదులన్
సీమాంతమ్ముగ గెంటు లోభమది యిస్సీ రాదు నిన్గొల్వ దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ సామర్థ్యంబు - తలంపదు - ఇంత - అయినన్ - విశ్వాసంబు - పోకార్చున్ - హేలామందస్మిత ధైర్యసాహసికతా లజ్జాభిమానాదులన్- సీమాంతమ్ము - కన్ - గెంటున్-లోభము - అది - ఇస్సీ - రాదు - నిన్ - కొల్వన్ -

ప్ర॥ లోభము = పిసినిగొట్టుతనము, సామర్థ్యంబు = ఇతరులయొక్క నేర్పు, తెలివితేటలయందలి గొప్పతనమును, ఇంతయినన్ = కొంచెమైనను, తలంపదు = విచారింపదు, విశ్వాసంబున్ = నమ్మకమును, పోకార్చున్ = నశింపఁజేయును; హేలా......................నాదులన్, హేలా = శృంగారభావమువల్లఁ బుట్టువానిని, మందస్మిత=కొద్ది చిఱునవ్వును, ధైర్య= కష్టములయందును నిలఁబడియుండుటను, సాహసికతా = మంచిపనులు చేయుట యందగు తెంపును, లజ్జా = పనికిమాలిన పనులుచేయుటయం దగు తలవంపును, అభిమానము = మంచిపను లాచరించుట యందు పట్టుదలను, ఆదులన్ = మొదలయిన వానిని, సీమాంతమ్ముగన్ = పొలిమేరదాటి పోవునట్లుగా, గెంటున్ = తఱిమివేయును. ఇస్సీ = నిందింపఁదగినది, అది= ఆలోభగుణము, నిన్=నీస్వరూపమును, కొల్వన్ = పూజించుటకు, రాదు= రాకుండును.

పిసినిగొట్టుతనము తనయెదుట నద్భుతముగాఁ జూపించుసామర్థ్యము నెంతయేని మెచ్చుకొనదు. శృంగారము, చిఱునవ్వు, ధైర్యము, తెంపు, సిగ్గు, అభిమానము మొదలంట నశింపఁజేయును. కాని కూడఁబెట్టినధనము నీకై యుపయోగింప నీయదు.

శా॥ భామా పుత్త్రగృహాదులే భవముఁదేపంబోలి దాటించు నం
చేమోకల్పన లల్లిబిల్లిగఁ గడున్ సృష్టించుఁ గష్టంపడున్
మీమాయంచును భేదమెంచు వలపేనిన్‌రాదు నిన్గొల్వ దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

భామాపుత్త్ర గృహాదులు - ఏ - భవమున్ - తేఁపన్ - పోలి - దాటించున్ - అంచున్ - ఏమో - కల్పనలు - అల్లిబిల్లి - కన్ - కడున్ - సృష్టించున్ - కష్టంపడున్ - మీ - మా - అంచున్ - ఈ - భేదము - ఎంచున్ - వలపు - ఏనిన్ - రాదు - నిన్ - కొల్వన్ -

ప్ర॥ వలపేనిన్ = మోహముగూడ, భా.........లే, భామా = భార్యయును, పుత్త్ర = కుమారుఁడును, గృహములే = ఇల్లు మొదలయి నవే, భవమున్ = సంసారమును, తేఁపన్ = తెప్పకొయ్యను, పోలి = సరిచేయుటకయి. దాటించునంచున్ = అవ్వలి యొడ్డునకు చేర్చునని నమ్మచు, ఏమో = చెప్పుటకు వీలుపడని, కల్పనలు = లేనిపోని వాని నూహించుటలను, అల్లిబిల్లిగన్ = మిక్కిలి చక్కదనము గలుగునట్లు, సృష్టించున్ = కలిగించు చుండును, కష్టంపడున్ = పై జెప్పిన భార్యా పుత్త్రాదులకై మిక్కిలి శ్రమంపడుచుండును. మీ = ఈ వస్తువుమీది, మా = ఈ వస్తువుమాది, అంచున్ = అనుచు, భేదము = వేఱను భావమును, ఎంచున్ = తలంచు చుండును, నిన్ = నీ స్వరూపమును, కొల్వన్ = పూజించుటకు, రాదు = రాకుండును.

మోహము, తన్ను దారాపుత్త్రాదులు ధనకనకవస్తు వాహనములు మొదలయినవే, సంసారమునుండి తరింపఁజేయు నను భ్రాంతిలోబడి లేని పోని ప్రయోజనము మాలిన యూహలను కల్పించుకొను చుండును. కుటుంబినియుఁ దీరకై ప్రయత్నింపదు, కాన శ్రమంపడు చుండును.

శా॥ సాముంజేయును మైకముంగొనును హేషల్ సల్పు ఘూర్ణిల్లు మే
ల్గీముం గానదు కన్నులుండియును భుక్తిం దృప్తికిం గాదు క్రిం
దై మృత్పిండముఁబోలుఁగాని మద మాహా రాదు నిన్గొల్వ దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా! హారహీరాకృతీ!

ప॥ సాముఁ - చేయుఁ - ఉ - మైకముఁ - కొనున్ - ఉ - హేషల్ - సల్పుఁ - ఘూర్ణిల్లుఁ - మేల్గీముఁ - కానదు - కన్నులు - ఉండి - ఉఁ - ఉ - భుక్తిఁ - తృప్తికిఁ - కాదు - క్రిందు - ఐ - మృత్పిండముఁ - పోలుఁ - కాని - మదము - ఆహా - రాదు - నిఁ - కొల్వఁ -

ప్ర॥ మదము=మదమను శత్రువు, సాముఁ=కఱ్ఱలతో పోరాడుట, చేయుఁ = సల్పును. మైకము = ఒడలు తెలియకుండుటను, కొనుఁ = గ్రహించును, హేషల్ = సకిలింపులను, సల్పుఁ = చేయుచుండును, ఘూర్ణిల్లుఁ = బొబ్బలు పెట్టుచుండును, మేల్గీముఁ = మంచిస్థానమును, కానదు = విచారింపదు, కన్నులు = నేత్రములు, ఉండియుఁ = కలిగి నప్పటికిని, భుక్తిఁ = ఆహారపదార్థములను తినుచున్నాడు. తృప్తికిఁ = తనియుటకు కాదు = కాకున్నను, క్రిందై = క్రిందపెట్టునదియుండి, మృత్పిండముఁ = మంటిముద్దను, పోలన్ = సరిచేయఁదగియుండును, కాని = పైఁజెప్పిన యక్షేపవర్తించు చుండును గాని, నిఁ = నీస్వరూప మును, కొల్వఁ = సేవించుటకు, రాదు = రాదయ్యెను. ఆహా = ఆశ్చర్యము.

మీది మాది యను భేదబుద్ధిఁ గల్పించును గాని మీసేవనమునకు రాఁజా లదు. మఱియు కఱ్ఱలాడించును శరీరము తెలియనీయదు. సకిలింపజేయును గోల సేయును. కన్నులుండియు మంచిమార్గముఁ గానఁ జాలదు. తిండిపోతు తనముఁ జూపించును. మంటిముద్దవలె నున్నచోటనేయుండి విచారణశూన్య మగును గాని మీయునికి నేమాత్రమును నెఱుంగదు.

శా॥ ఏమాత్రంబు సహింపలే దొకనిమే లెప్డుఁ వివాదించు లో
లో మూర్ఖత్వము వెల్లడించుఁ బోరి మేల్కొల్పుఁ బగఁ సర్వదా
యామాత్సర్యము నిన్నుఁ గొల్చుటకుఁ గాదయ్యా! దయామేయదు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ ఏమాత్రంబుఁ - సహింపఁ - లేదు - ఒకని మేలు - ఎప్డుఁ - వివాదించుఁ - లోఁ - లోఁ - మూర్ఖత్వముఁ - వెల్లడించుఁ - పోరిఁ - మేల్కొల్పుఁ - పగఁ - సర్వదా - ఆమాత్సర్యము - నిన్నుఁ - కొల్చుటకుఁ - కాదు - అయ్యా! - దయామేయ! -

ప్ర॥ మాత్సర్యము= మచ్చరమనునది, ఒకని మేలు = ఇతరుని మేలును, ఏమాత్రంబుఁ = కొంచెమయినను, సహింపన్ = సైరించుటకు, లేదు = అవకాశమును కలుగనీయదు, వివాదించుఁ = విన దానిని కాద నియును, కాని దాని నవుననియును పెడవాదములు చేయుచుండును. లోలోఁ = లోపలను మాటుపడియున్న, మూర్ఖత్వముఁ = దట్టమయిన యజ్ఞానమును, వెల్లడించుఁ = బయలు పడునట్లు చేయుచుండును, సర్వదా= ఎల్లప్పుడును, పోరిఁ = మాటిమాటికిని, పగఁ = విరోధమును, మేల్కొల్పుఁ = మంచివారికి గూడ మనస్సును త్రిప్పు కలిగించుచుండును, ఇంతే కాని, దయామేయ! = ఎనలేని దయకు గనియైన తల్లీ! తండ్రీ! నిన్నుఁ= నిన్ను, కొల్చుటకు= సేవించుటకు, అయ్యా! =ప్రపంచమునకు కన్న తండ్రీ కాదు = కాకుండును.

మచ్చరము, ఇతరుల మేలు సుంతయేనియు సహింపదు. మాటి మాటికి లోనున్న పెంకెతనమును పైకి వెల్లడించు చుండును. ఎల్ల వేళలను లేని పోని పగను సాధించుచుండును గాని మీకింకరత్వముఁ జేయఁజాలదు

శా॥ శ్రీమించు ల్నిధులెన్నియేని వెలయం జెల్వొంది దివ్యౌషధీ
స్తోమంబు న్నెలకొల్పిగంధవతియై శోభిల్లి భూతత్త్వముల్
నీమేనే యగునయ్య దర్శనహృతానే కాఘ సర్వజ్ఞ దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ శ్రీమించుల్-నిధులు - ఎన్ని - ఏనిన్ - వెలయన్ - చెల్వు - ఒంది - దివ్యౌషధీస్తోమంబున్ - నెలకొల్పి - గంధవతి - ఐ - శోభిల్లు- భూతత్త్వముల్- నీమేను - ఏ - అగున్ - అయ్య - దర్శన హృతానే కాఘ! - సర్వజ్ఞ -

ప్ర॥ శ్రీమించుల్ = సంపదలయొక్క ప్రకాశముగల, నిధులు = బంగారము, వెండి, రత్నములు మొదలయినగనులు, ఎన్నియేనిన్ = లెక్కించుటకు వీలుపడని యన్ని, వెలయన్ = అక్కడక్కడ నొప్పు చుండఁగా, చెలువు = అందము, ఒంది = పొంది, దివ్యౌషధీస్తోమంబున్, దివ్య = రాత్రులయందు దీపములవలెఁ బ్రకాశించునవియు, తుంపులయిన వాని నదికించునవియు, మరల బ్రదికించునవియు మొదలగు, ఓషధీ = తీఁగెలయొక్క, స్తోమంబున్ = సమూహమును, నెలకొల్పి = తనయందు పాదుకొనఁజేసి, గంధవతియై= వాసనకలిగి యుండుటే నిజ స్వరూపముగా కలదియై, శోభిల్లు = ప్రకాశించు నటువంటి, భూతత్త్వముల్ = పంచ భూతములలో నొకటియైన భూమియును, దర్శనహృతానేకాఘ, దర్శన= చూచినంత మాత్రముననే, హృత = హరింపఁబడిన, అనేక = పెక్కు శరీర ములచే నార్జించుకొనిన, అఘ = సేవించు జీవులపాపముకల తల్లీ! తండ్రీ! సర్వజ్ఞ = అన్నిటిని తెలిసినతల్లీ ! తెలిసినతండ్రీ! నీమేను = నీశరీరము, (అష్టమూర్తులలో నొకటి,) అగును = ఐయుండును.

అష్టమూర్తులలో నొకటియై సంజీవకరణి, సంధానకరణి, విశల్య కరణి, జ్యోతిర్లతలు (రాత్రులందు దీపములవలెఁ బ్రకాశించునవి,) సస్యములు వృక్షములు మొదలైనవి. బంగారము, వెండి, కంచు, రాగి, ఇత్తడి, మొదలైనవి తనలో దాచి పోషించి ప్రకటించుచు గంధము (వాసన)గుర్తుగా గల భూమి నీ మూర్తియే యైయున్నది.

శా॥ భూమాకారము భూమికారణము సంపూర్ణాయురారోగ్య సు
శ్రీ మూలంబు శుచి ప్రవర్తకమునౌ సృష్ట్యాదితత్త్వంబు జి
హ్వామోఘంబుత్వదీయమూర్తియగుఁగాసామోదసంస్తుత్యః దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహారాకృతీ!

ప॥ భూమాకారము - భూమికారణము - సంపూర్ణాయురారోగ్య సుశ్రీమూలంబు - శుచిప్రవర్తకముఁ - ఔ సృష్ట్యాది తత్త్వంబు - జిహ్వామోఘంబు- త్వదీయమూర్తి- అగుఁ - గా - సామోద !- సంస్తుత్య -

ప్ర॥ భూమాకారము = గొప్పయాకారముగలదియు, భూమికారణము= భూమండలముకలుగుటకు కారణమయినదియు, సంపూర్ణా......మూలంబు, సంపూర్ణ = నిండయిన, ఆయుః = ఆయుస్సునకు, ఆరోగ్య = ఆరోగ్యమునకు (ఆయుస్సునకు కారణమైన దానికి) శ్రీః= సంపదలకు, మూలంబు = కారణమైనదియు, శుచిప్రవర్తకము = సదాచారము కలిగించునదియు, జిహ్వామోఘంబు = నాల్కయందు సర్వకాలము నాటిపోకుండునదియు నగు, సృష్ట్యాదితత్త్వంబు = ప్రపంచ స్వరూపమునకు కారణములయిన పంచభూతముల సృష్టిలో మొదలిదియగు జలతత్త్వము, సామోద= నిత్యానందయుక్తా ! సంస్తుత్య = కొనియాడఁదగిన తల్లీ! తండ్రీ!, త్వదీయమూర్తి = నీ సంబంధమయిన శరీరము, అగుఁగా= ఔనుగదా.

పెద్ద యాకారము గలిగి భూమి యేర్పడుటకు కారణమై స్నానపానాదులచే సర్వమున కారోగ్యముఁగలిగించుచు శుద్ధత్వమును కొలిపి నాలుక పుట్టుకకు ప్రధానమై సృష్టికి మొదలిదియయిన యుదకమును మీ మూర్తులలో నొకటిగాయున్నది.

శా॥ శ్రీమెప్పల్ విరియించు యజ్ఞహుతముల్ శీఘ్రంబ జేజేలకున్
ప్రేమంజేర్చుచు జాఠరాంతరమునం బ్రేరేచు నయ్యగ్నియున్
నీమేనే యగునయ్య! నిర్మల యశో నీరంధ్రభూత్యంగ దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ శ్రీమెప్పల్ - విరియించుయజ్ఞహుతముల్ శీఘ్రంబు - ఆ - జేజేలకున్ - ప్రేమన్ - చేర్చుచున్ - జాఠరాంతరమునన్ - ప్రేరేచు నయ్యగ్ని - ఊన్ - నీమేను - ఏ - అగున్ - అయ్య - నిర్మల యశోనీరంధ్ర - భూత్యంగ -

ప్ర॥ శ్రీ మెప్పల్ = సంపదలయొక్క పొగడ్తలను, విరియించు యజ్ఞహుతముల్, విరియించు = వృద్ధిని బొందించు, యజ్ఞ = జ్యోతిష్టోమము మొదలయిన యజ్ఞముల యొక్క, హుతముల్ = హవిర్ద్రవ్యములను, శీఘ్రంబ = యజమానుడు తన యందుంచిన వెన్వెంటనే, జేజేలకున్ = ఎల్ల దేవతలకును, చేర్చుచున్ = చెందునట్లు చేయుచు, జాఠరాంతరమునన్ = ఉదరగోళముయొక్క మధ్య ప్రదేశమునయందు, ప్రేరేచు నయ్యగ్నియున్ = తిను నాహారపదార్థములను నానాడులయందు ప్రసరింపఁజేయు ప్రాణాది దశవాయువులయొక్క సంచారము నుంతయేని యాటంకములేక నడచునట్లు చేయు సుప్రసిద్ధమయిన యగ్నిహోత్రుఁడును; నిర్మల యశోనీరంధ్ర, నిర్మల = మిక్కిలి స్వచ్ఛమయిన, యశః = కీర్తిచే, నీరంధ్ర = అంతట నిండియున్న తల్లీ! భూత్యంగ, భూతి = భస్మము, అంగ ! = శరీరము నందంతట ప్రకాశించు తండ్రీ! నీమేనే = నీశరీరమే, అగునయ్యా = అయి యున్నాడు.

తన్ను పొషించువారలకు సంపదలొసంగుచు యజ్ఞములయందలి హవిర్భాగములను దేవతలకు వెన్వెంటనే చేర్చుచు, గర్భగోళములందుఁ జేరి పదార్థములను జీర్ణింపఁజేయుచు వాయు ముఖమున నేర్పడు నగ్నియు మీ మూరులలో నొకటి.

శా॥ వ్యోమార్గంబునఁబుట్టువందివెలి లో నుత్సాహముంగూర్చుచున్
సామోదమ్ముగ స్పర్శసౌఖ్యమిది యత్యానందముంగూర్చుతా
నీమేనే యగునయ్య వాయువును వాణీగేయ సుధ్యేయ దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ ।

ప॥ వ్యోమార్గంబునన్ - పుట్టువు - అంది - వెలిన్ - లోన్ - ఉత్సాహమున్ - కూర్చుచున్ - సామోదమ్ము - కన్ - స్పర్శసౌఖ్యము - ఇది - అత్యానందమున్ - కూర్చుతాన్ - నీమేను - ఏ - అగున్ - అయ్య - వాయువున్ - ఈ - వాణీగేయసుధ్యేయ - దుర్గా! మల్లేశ్వర!

ప్ర॥ వ్యోమార్గంబునన్ = ఆకాశమార్గమందు, పుట్టువు = జన్మమును, అంది = పొంది, వెలిన్ = వెలుపలను, లోన్ = లోపలను, ఉత్సాహమున్ = ఆనందాతిశయమును, కూర్చుచున్ = సమస్తప్రాణులకు కలిగించుచును, సామోదమ్ము = ఆనందముతోఁ గూడుకొని యుండుట, కన్ = అగునట్లు, స్పర్శ సౌఖ్యము = తాకుటవల్లనైనహాయిని, ఇడి = ఒసఁగి, అత్యానందమున్ = ఆనందలోకమునుగూడ నతిక్రమించియున్న హాయిని, కూర్చుతాన్ = కలిగించుచున్న తాను, వాయువు, వాణీగేయసుధ్యేయ, వాణీ = సరస్వతీదేవిచే, గేయ = సంగీతప్రబంధములయందు, సుధ్యేయ != కొనియాడఁదగిన, తల్లీ! తండ్రీ! నీమేనే = నీశరీరమే, అగునయ్యా= ఐయుండును.

ఆకాశమునుండి యేర్పడి సర్వ ప్రాణులకు లోపలను వెలుపలను ప్రేరణగావించుచును, సోకునంత హాయినిగల్పించు వాయుమహాభూతమును నీమూర్తులలో నొకటి యైనది.

శా॥ పైపై పీడిన సర్వజీవతతి యప్రత్యక్షసంస్కారముల్
లోమైజేర్చుచువాయువృష్టిముఖతన్. లోకంబులన్‌జొన్పుమిన్
నీమేనేయగుగాదె గాంగలహరీ నిర్యజ్జటాజూట దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా! హారహీరాకృతీ!

ప॥ పై పై - వీడినన్ - సర్వజీవతతి యప్రత్యక్షసంస్కారముల్- లోమైన్ - చేర్చుచున్ - వాయువృష్టిముఖతన్ - లోకంబులన్ - చొన్పుమిన్ - నీమేను - ఏ - అగున్ - కాదు- ఎ - గాంగలహరీనిర్యజ్జటాజూట -

ప్ర॥ పైపై = స్థూలశరీరము, వీడినన్ = పోయినప్పటికిని, సర్వ... .........ముల్, సర్వ = సమస్తమయిన, జీవ = జీవులయొక్క, తతి = సమూహముయొక్క, అప్రత్యక్ష = కంటికి గన్పడకుండు, సంస్కారముల్ = పుణ్యాపాపరూపములయిన జీవులకృతములను, లోమైన్ = సూక్ష్మ శరీరమునందు (లింగశరీరమందు), చేర్చుచున్ = చేరునట్లుచేయుచు, వాయువృష్టిముఖతన్, వాయు, = మొట్టమొదట వాయువుయొక్క, వృష్టి = వర్షముయొక్క, ముఖతన్ =ద్వారా, లోకంబులన్ = పదునాల్గుభువనముల యందును, చొన్పుమిన్ = ప్రవేశింపజేయునాకాశమును. గాంగ ...... జూట, గాంగ = గంగాసంబంధమయిన, లహరీ = ప్రవాహములను, నిర్యత్ = స్రవించుచున్న, జటాజూట = జడలగుంపుగలతండ్రీ! నీమేనే= నీశరీరమే, అగుగాదె = ఔనుగదా.

స్థూలశరీరము వదలినపిమ్మట కనబడకుండు ఎల్లజీవుల సంస్కారములను వాయువువలన సూక్ష్మశరీరమున నందించుచు, వర్షము మొదలయిన సాధనముల ద్వారా కర్మభూములయందు ప్రవేశింపజేయు మహాకాశము మీ మూర్తియై యున్నది.

శా॥ సామర్థ్యంబున నర్థవంతుఁడగుచున్ జాతాత్మయై పండితుం
డై మేఘాభశిరోజుఁడై హుతవహుం బ్రార్థించునయ్యాజ్వయున్
నీమేనే యగుఁగాదె యెన్నఁగ భవానీనాథ సమ్మోద దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా హారహీరాకృతీ!

ప॥ సామర్థ్యంబునన్ - అర్థవంతుఁడు - అగుచున్ - జాతాత్మ - ఐ - పండితుండు - ఐ - మేఘాభశిరోజుఁడు - ఐ - హుతవహున్ - ప్రార్థించునయ్యాజ్వ - ఉన్ - నీమేను - ఏ - అగున్ - కాదు - ఎ - ఎన్నన్ - కన్ - భవానీనాథ - సమ్మోద -

ప్ర॥ సామర్థ్యంబునన్ = దక్షత్వముతో, అర్థవంతుఁడు = సంపదలుగలవాడు, అగుచున్ = ఐ యొప్పుచున్, జాతాత్ముఁడు = కలిగిన సంతానముకలవాఁడు, ఐ=అగుచు, పండితుండు= మంత్రార్థములోని యథార్థ స్వరూప మెఱింగినవాఁడును, ఐ = అగుచు, మేఘాభశిరోజుఁడు = మేఘకాంతికల తల వెండ్రుకలు కలవాఁడు, ఐ = అగుచు, హుతవహున్ = అగ్నిహోత్రుని, ప్రార్థించునయ్యాజ్వయున్ = స్తోత్రముఁజేయు ప్రసిద్ధుఁడయిన సోమయాజియు. భవానీనాథ = పార్వతీ మనోహరా! సమ్మోద = నిండుసంతోషమునవుండు తల్లీ! తండ్రీ!, నీమేనే = నీశరీరమే, అగుఁగాదె= ఐయున్నవాడు గదా.

సర్వవిషయములు సమర్థించుకొనుశక్తియు, పుష్కలమగుద్రవ్యము, సంతానము, మంత్రార్థజ్ఞానము, నెరయని తలయు గలిగి యజ్ఞములన్నిఁటి నొనర్చిన సోమయాజియు నీమూర్తులయం దొకటియై యున్నాడు.

శా॥ చీమంబోలుచుఁ గూడఁబెట్టిన మహాశ్రేయస్సులన్ దుర్లభం
బౌ మానుష్యముఁ జెందియుంగడఁగి నిత్యానిత్య విజ్ఞాన ల
క్ష్మి మర్యాద నతిక్రమించునెడ దూషింపంబడున్ బిట్టు దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా హారహీరాకృతీ!

ప॥ చీమన్ - పోలుచున్ - కూడఁబెట్టిన మహాశ్రేయస్సులన్ - దుర్లభంబు - మానుష్యమున్ - చెందియున్ - కడఁగి - నిత్యానిత్య విజ్ఞానలక్ష్మి మర్యాదన్ - అతిక్రమించునెడన్ - దూషింపంబడున్ - బిట్టు -

ప్ర॥ చీమన్ = మిక్కిలి సన్ననయిన క్రిమిని, పోలుచున్ = సరియగు నట్లొప్పుచు, కూడఁబెట్టిన మహాశ్రేయస్సులన్ = ఒక్కచోట్రోవు చేసి పెట్టుకొనిన గొప్ప శుభములచేత, దుర్లభంబు = పొందుట కశక్యము, మానుష్యమన్ = మానవత్వమును, చెందియున్ = పొందియును, కడఁగి = ప్రయత్నించి, నిత్యా............దన్, నిత్య = నిలిచియుండు దానిని, అనిత్య= నశించిపోవుదానిని, విజ్ఞాన= తెలిసికొనుటయను, లక్ష్మి= సంపదయొక్క, మర్యాదన్ =హద్దును, అతిక్రమించునెడన్= ఉల్లంఘించి నట్లయిన, బిట్టు = కఠినముగా, దూషింపంబడున్, = దూషణముఁ జేయుటకు తగియుండును.

వేనవేలు జన్మములెత్తి చీమవలెఁ గూడబెట్టుకొనిన పుణ్యవిశేషముచే మనుష్యత్వ మందియుఁ బ్రయత్న పూర్వకముగా మంచి చెడ్డలను విచారింపక హద్దుమీఱిన మనుష్యుని నెల్లవారును గఠినుఁడని దూషించు చుందురు.

శా॥ ఆముల్లోకములందు నాచరణమే యాత్మస్వరూపంబుగా
లోమై స్త్రీపురుషుల్ కనుంగొనఁగనై లోకంబుల న్నిల్పుత
త్క్షేమాకారము ధర్మ మీజగతి శాసించుం ద్వదీయాజ్ఞ దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ ఆముల్లోకములందున్ - ఆచరణము - ఏ - ఆత్మస్వరూపంబు - గాన్ - లోనై - స్త్రీపురుషుల్ - కనుంగొనన్ - కన్ - ఐ - లోకంబులన్ - నిల్పు తత్ క్షేమాకారము - ధర్మము - ఈజగతిన్ - శాసించున్ - త్వదీయాజ్ఞన్ -

ప్ర॥ ఆముల్లోకములందున్, ఆ = సుప్రసిద్ధమయిన, ముల్లోకము అందున్ = స్వర్గ మర్త్య పాతాళము లను మూడు లోకముల యందును, ఆచరణమే = వేదములయందు శాస్త్రములందుఁ జెప్పఁబడినట్లు నడకను చేయుటయే, ఆత్మస్వరూపబు, ఆత్మ = తనయొక్క, స్వరూపము = ఆకారము, గాన్ = అగుచుండఁగా, లోనై = సూక్ష్మశరీరముచే (సుగంధ పాత్రలయందువలె) కనుంగొనఁగన్ = చూచుటకు, ఐ = ఒప్పి, లోకంబుల న్నిల్పు తత్ క్షేమాకారము, లోకమ్ములన్ = పదునాలుగు భువనములను, నిల్పు = ఎడతెగకుండ నిలువఁబెట్టఁగలదియు, తత్ = ఆప్రపంచములయొక్క, క్షేమ = శుభకరము. ఆకారము = నిలువుగలదియునగు, ధర్మము = పురుషార్థములలో మొదటిది. త్వదీయాజ్ఞన్ = నీవు చెప్పిన వేదశాస్త్రములచే స్వరూపముగల నీ శాసనముచే. ఈజగతిన్ = ఈభూమండలమునందు, శాసించున్ = శిక్షించుచుండును.

ఇనుము నయస్కాంత మాకర్షించినట్లు ధర్మము సర్వజీవులను నాకర్షించి నడువఁబెట్టును. అట్టియీ మనుజులు ధర్మము ననుసరింపఁదగును గాని మనుజులను ధర్మమనుసరించుట యసంభవము. మీ శాసనమైన వేదమందున్న విశేషములను వివరించి బోధించుచు లోకములకు క్షేమము కలిగించుచుండును.

శా॥ కామంబర్థము ధర్మయుక్తమగుచోఁ గల్పద్రుమంబేయగుఁ
కామంబర్థము నేకమైన జగముల్ కాలాహి వాతం బడుఁ
ధీమేదో బలయుక్తి దీనినెఱుఁగం దీఱుంబశుత్వంబు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ కామంబు - అర్థముఁ - ధర్మయుక్తము - అగుచోఁ - కల్ప ద్రుమంబు - ఏ - అగుఁ - కామంబు - అర్థముఁ - ఏకము - ఐనఁ - జగముల్ - కాలాహివాతఁ - పడుఁ - ధీమేదోబలయుక్తిఁ - దీనిఁ - ఎఱుఁగఁ - తీఱుఁ - పశుత్వంబు -

ప్ర॥ కామంబు = కోరిక, అర్థము = ద్రవ్యమును, ధర్మయుక్తము = ధర్మముతోఁగూడినది, అగుచోఁ = అయినట్లయితే, కల్పద్రుమంబే = అడిగినదెల్ల సమకూర్చు కల్పవృక్షమువంటిదే యగును. కామంబు = కోరిక, అర్థము = ద్రవ్యమును, ఏకమైనఁ = ఒక్కటియగుచోఁ. (సద్వినియోగము కానిచో) జగముల్ = పదునాలుగు భువనములును, కాలాహి వాతఁ, కాల = మృత్యువను, అహి = సల్లత్రాచుయొక్క, వాతఁ = నోటియందు, పడుఁ = పడిపోవును. ధీమేదోబలయుక్తిఁ, ధీ = సద సద్వివేకశాలియగు బుద్ధియొక్క, మేదః = మెదడుయొక్క, బల = బలముతోడి, యుక్తిఁ = సంబంధముచేత, దీనిఁ = ఈవిషయమును, ఎఱుగఁ = తెలిసినచో, పశుత్వంబు = విధినిషేధములను తెలియక ప్రవర్తించుట, తీఱుఁ = నశించును.

పురుషార్థములలోఁ జేరిన యర్థకామములు (కోరిక, ద్రవ్యము) మొదలిదియైన ధర్మముతోఁ గూడియున్నప్పుడు, కల్పవృక్షమువలె మనోభీష్టముల నెఱవేర్చును. అట్లుగాక తమకు తామే కలసియున్నచో, ధర్మము శూన్యమగుట, లోకము నశించును. బుద్ధిబలముచే నీవిషయమును గుర్తెఱిఁగిన సంపూర్ణ జ్ఞానవంతుఁడై తరించును.

శా॥ నోముల్ నోమి కృశించి కష్టపడి యెన్నోపాట్లపాలై శుభ
శ్రీమేల్కొల్పుచు నేలుకోఁగల మహాప్రేమ స్వరూపంబు జి
హ్వామాధుర్యము కన్నతల్లి కెనయౌ నా? స్వర్గముఁభర్గ! దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ నోముల్ - నోమి - కృశించి - కష్టపడి - ఎన్నోపాట్లపాలు - ఐ - శుభశ్రీన్ - మేల్కొల్పుచున్ - ఏలుకోన్ - కల మహాప్రేమ స్వరూపంబు - జిహ్వామాధుర్యము - కన్నతల్లికి - ఎన - ఔనే - ఆ - స్వర్గమున్ - భర్గ -

ప్ర॥ నోముల్ = అనేక వ్రతములు, నోమి = నోచి, కృశించి = ఉపవాసములచే నియతాహారములచే చిక్కిపోయి, ఎన్నో పాట్ల పాలు = ఎన్నోవిధములయిన బాధలకువశము, ఐ = అగుచు, కష్టపడి = తనకొరకు నలుగురును చెప్పిన యట్లు శ్రమమయినను అనుభవించి, శుభశ్రీన్ = మేలనెడు సంపదను, మేల్కొల్పుచున్ = కలుగఁజేయుచు, ఏలుకోన్ = రక్షించుటకు, కలమహాప్రేమస్వరూపంబు కల = ఒప్పుచున్న, మహా = గొప్పదయిన ప్రేమ = వాత్సల్యముయొక్క, స్వరూపంబు = ఆకారమైనదియు, జిహ్వామాధుర్యము, జిహ్వ = నాలుకయొక్క, మాధుర్యము = రుచియునైన, కన్నతల్లికి = కన్నయమ్మకు, స్వర్గమున్ = దేవలోకమేనియు, ఎన = సరి, ఔనా = అగునా! భర్గా! శి

తాను పుట్టుటకయి తన తల్లి యెల్లవ్రతముల నుపవాసములను సలిపిసలిపి శ్రమము సహించి గర్భగోళమున నవమాసములు మోసి పుట్టిన తరువాతఁదనకు జబ్బులేకున్నను పథ్యమునకై నోముకట్టుకొని యింతవాని నంతవానిఁగాఁ బెంచి యుస్సురయేని సత్వరము లాఁకర్చి కనులపండువుగా నలంకరించి చూచుకొను స్త్రీరూపమయిన మహాప్రేమ, తల్లితో స్వర్గమేనియు సామ్యముఁ బొందజాలదు,

శా॥ క్షేమంబుం గలిగించు నోషధివలెం జేతఃప్రమోదావహం
బౌ మోచాఫలమైన పల్కుబడి స త్యంబుం బ్రబోధించుచుణ్
నీమేనేయగుఁ గన్నతండ్రి శ్రుతిని ర్ణిద్రాత్మ విజ్ఞాన దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా! హారహీరాకృతీ!

ప॥ క్షేమంబుణ్ - కలిగించు నోషధి - వలెణ్ - చేతఃప్రమోదావహంబు - ఐ - మోచాఫలము - ఐన పల్కుబడిణ్ - సత్యంబుణ్ - ప్రబోధించుచుణ్ - నీమేను - ఏ - అగుణ్ - కన్నతండ్రి - శ్రుతి - నిర్ణిద్రాత్మ విజ్ఞాన!

ప్ర॥ క్షేమంబుణ్ = ఆరోగ్యమును, కలిగించునోషధివలెణ్ = కలుగఁజేయునట్టి గొప్ప చెట్టుక్రియవలె, చేతఃప్రమోదావహంబు, చేతః = మనస్సునకు, ప్రమోద = సంతోషమునకు, ఆవహంబు = కలిగించునది, బౌ మోచాఫలమైన పల్కుబడిణ్, బౌ = అయినట్టి, మోచాఫలము = చక్రకేళి యరటిపండువంటిది, ఐన పల్కుబడిణ్ = అయినట్టి వాక్యములతో, సత్యంబుణ్ = యథార్థమయినదానిని, ప్రబోధించుచుణ్ = బాగుగాఁ దెలియఁజేయుచు, కన్నతండ్రి = తన్నుఁ గనినతండ్రి, శ్రుతినిర్ణిద్రాత్మ విజ్ఞాన, శ్రుతి = వేదములయందు, నిర్ణిద్ర = మేల్కొనియుండెడు, ఆత్మ = నీసంబంధమయిన, విజ్ఞాన = స్వరూపమును, తెలిసికొనెడు తల్లీ! తండ్రీ! నీమేనే = నీశరీరమే, అగుణ్ = అగుచున్నాడు.

గొప్ప వనమూలికవలె క్షేమము గలిగించుచు మనమున కానందము గలిగించు మంచి తియ్యని పలుకుబడితో సత్యము యొక్క స్వరూపమిట్టిదని బోధించు కన్నతండ్రి మీ మనుజమూర్తియని చెప్పనగు.

శా॥ తాముప్పాటలబుద్ధికిం దగిన చందానం బ్రబోధించుచున్
ప్రేమన్ వృద్ధికివచ్చు పద్ధతుల రూపింపన్ గురుండౌ గురు
స్వామిన్ శిష్యుఁడునిన్నుఁగాఁదలఁపఁడాశ్చర్యంబగున్ నేఁడుదు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా ! హారహీరాకృతీ!

ప॥ తాన్ - ముప్పాటలన్ - బుద్ధికిన్ - తగినచందానన్ - ప్రబోధించుచున్ - ప్రేమన్ - వృద్ధికిన్ - వచ్చుపద్ధతులన్ - రూపింపన్ - గురుండు - ఔగురుస్వామిన్ - శిష్యుఁడు - నిన్నున్ - కాన్ - తలఁపఁడు - ఆశ్చర్యంబు - అగున్ - నేఁడు.

ప్ర॥ తాన్ = తాను, ముప్పాటలన్ = మూడువేళలయందును, బుద్ధికిన్ = శిష్యుఁడు గ్రహించు బుద్ధివిశేషమునకు, తగిన చందానన్ = తగునట్టిరీతిగా, ప్రబోధించుచున్ = బాగుగాఁ దెలియఁ జేయఁదగిన విశేషములను తెలియఁజేయుచు, ప్రేమన్ = బిడ్డయందలి వాత్సల్యముచే, వృద్ధికిన్ = పయికి, వచ్చుపద్ధతులన్ = వచ్చునట్టి మార్గములను, రూపింపన్ = ఇది యిట్లని నిర్ణయించి చెప్పుటను, గురుండు = బృహస్పతివంటివాఁడు, ఔగురుస్వామిన్ = అయినట్టి గురూత్తముని, శిష్యుఁడు = శిష్యుఁడగువాఁడు, నిన్నుఁగాన్ = నీ స్వరూపముగాను, తలఁపఁడు = భావింపఁడు, నేఁడు = ఈ కలికాలమందు, ఆశ్చర్యంబు = అద్భుతము, అగున్ = అగుచున్నది.

ముప్పాటలయందు నెట్లు చెప్పిన సులభముగాఁ దెలియునో అట్లు బోధించుచు బృహస్పతివలెఁ దానుబాగుపడు పద్ధతులిట్లనుచు నిరూపించు గురువును శిష్యుఁడీ కలికాలమందు నీ మూర్తిఁగా భావింపఁ జాలకున్నాడు.

శా॥ ప్రేమన్ వెల్లడిజేయుచున్ సెలవులన్ బెల్లుబ్బుపాల్బుర్వులన్
మోముంజేరిచి తల్లి పాలపొదుగున్ ముద్దైన లే లేఁగ పా
లౌ మేల్పాలును విల్చువాఁడు మనుజుండౌనా మహాదేవ దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ ప్రేమన్ - వెల్లడిన్ - చేయుచున్ - సెలవులన్ - పెల్లుబ్బు పాల్బుర్వులన్ - మోమున్ - చేరిచి - తల్లిపాలపొదుగున్ - ముద్దు - ఐన లేలేఁగపాలు - ఔ మేల్పాలున్ - ఈ - విల్చువాఁడు మనుజుండు - ఔను - ఆ - మహాదేవ - దు

ప్ర॥ సెలవులన్ = పెదవులయందు, పెల్లు = అధికముగా, ఉబ్బు పాల్బుర్వులన్ = పైకి పొంగి పొరలు పాలయొక్క నురుగులచే, ప్రేమన్ = తల్లియందలి భక్తివిశేషమును, వెల్లడిన్ = ప్రకటమగునట్లుగా, చేయుచున్ = పొనరించుచు, తల్లిపాలపొదుగున్ = తల్లియొక్క పాలపొదుగును, మోమున్ = ముఖమును, చేరిచి = ప్రవేశపెట్టి, ముద్దు = చూచుటకానందము, ఐనలేలేఁగ = అయినట్టి పసిదూడయొక్క, పాలు = వంతయియొప్పు భాగము, ఔ మేల్పాలును = అయినట్టి ప్రశస్తమయిన పాలను, విల్చువాఁడు = అమ్ముకొనువాఁడు, మనుజుండు = మనుష్యుడు, ఔనా = అగునా? మహాదేవ! = సర్వదేవతా ప్రభూ! కాదు.

పెదవుల ప్రక్కలచే ముద్దులొలికించుచు పాలు దాగునప్పు డధిక ముగాఁ బైకి పొంగిపొరలు నురుగులతో దన తల్లి పాలపొదుగులో మోము జేర్చి దూడ త్రాగవలసిన పాలుగూడ దాని నోరుగట్టి తాను తీసుకొని యమ్ముకొను కఠినుఁడును మనుష్యుఁడగునా!

శా॥ శ్రీమేదఃపరిపుష్టిఁ గూర్పఁగల సు క్షీరంబులం గ్రోల్చుచున్
భూమిన్ దున్నఁగ భూరిభారము మెడన్ మోయన్ సమర్థంబులై
సోమస్వచ్ఛములైన వత్సముల నిచ్చుం గాదె గోమాత దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ శ్రీమేదః పరిపుష్టిన్ - గూర్పన్ - కలసుక్షీరంబులన్ - గ్రోల్చుచున్ - భూమిన్ - దున్నన్ - కన్ - భూరిభారము - మెడన్ - మోయన్ - సమర్థంబులు - ఐ - సోమస్వచ్ఛములు - ఐనవత్సములన్ - ఇచ్చున్ - కాదు - ఎ - గోమాత-

ప్ర॥ గోమాత = గోవను పేరుగలతల్లి, శ్రీమేదః పరిపుష్టిన్, శ్రీ = శరీరమునకు, ఆత్మకును వర్చస్సును, మేదః = మెదడునకు, పరిపుష్టిన్ = సంపూర్ణమయిన బలమును, గూర్పన్ = సమకూర్చుటకు, కలసుక్షీరంబులన్, కల = సమర్థములయిన, సుక్షీరంబులన్ = మేలయినపాలను. గ్రోల్చుచున్ = ఎల్లవారిచే ననుభవింపఁ జేయుచు, భూమిన్ = నేలను, దున్నఁగన్, = దున్నుటకును, భూరిభారమున్, భూరి = అధికమయిన, భారము = బరువును, మెడన్ = మెడయందు, మోయన్ = వహించుటకును, సమర్థంబులు = బలముకలవి, ఐ=అగుచు, సోమస్వచ్ఛములు, సోమ= చంద్రునివలె. స్వచ్ఛములు = పరిశుద్ధములు, ఐనవత్సములన్ = అయినట్టి కోడెదూడలను, ఇచ్చున్ గాదె!=ప్రజలకందఱకును నొసంగుచుండును గదా.

సంపదలను బుద్ధిబలమును శరీరారోగ్యమును గలిగించుపాలను వ్యవసాయమొనర్చను బరువులను లాగుటకును సారముగల కోడెదూడలను నిచ్చునట్టితల్లియైన గోవునకు సరివచ్చునది ముజ్జగములయందును గానఁబడదు.

శా॥ మైమైరాయుచుఁ గర్ణపుచ్ఛముల సమ్యక్ప్రీతిమై ద్రిప్పుచున్
గోమైపయ్యెర నీ రెలుంగు లిడునొక్కుల్ బీటిమేఁతన్ మొగిన్
రోమంథం బొనరించు గోచయము దృగ్రూపంబు రూపించు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ మై - మై - రాయుచున్ - కర్ణపుచ్ఛములన్ - సమ్యక్ప్రీతిమై - త్రిప్పుచున్ - గోమై - ఐ - పయ్యెరన్ - ఈరెలుంగులు - ఇడునొక్కుల్ బీటిమేఁతన్ - మొగిన్ - రోమంథంబు - ఒనరించు - గోచయము - దృగ్రూపంబు - రూపించున్ -

ప్ర॥ మై = ఒక గోవుశరీరముతో, మై = మఱొక గోవు శరీరమును, రాయుచున్ = రాచుకొనుచు కర్ణపుచ్ఛములన్, కర్ణ = చెవులను, పుచ్ఛములన్ = తోఁకలను, సమ్యక్ప్రీతిమై = మిక్కిలి సంతోషముతో, త్రిప్పుచున్ - అటునిటు నాడించుచు, గోమై = నవనవత్వము గలిగి, పయ్యెరన్ = మలయమారుతముచేత, ఈరెలుంగులు = సన్నని ధ్వనులు, ఇడునొక్కుల్ బీటిమేఁతన్, ఇడు = ఒసగునట్టి, నొక్కుల్ = చిన్నియలలవంటి నొక్కులుగల, బీటిమేఁతన్ = బీళ్ళయందైన మొలపచ్చిక పట్లయందు, మొగిన్ = వరుసగా. రోమంథంబు = నెమరును, ఒనరించున్ = పెట్టునట్టువంటి, గోచయము = గోవుల సమూహము (ఆలమందలు) దృగ్రూపంబు = కంటికి రూపమునకుఁ గల సంబంధమును, రూపించున్ = నిర్ణయము చేయును (కన్నులపండువొనరించుచుండును.)

ఒక గోవుతో నొకటి యొత్తికొనుచు సంతోషముచేఁ జెవులను తోఁకలను ద్రిప్పికొనుచు గాలికి ఈలవంటి సన్నని మ్రోఁతతో నిగనిగ మనుచు నొక్కులు నొక్కులుగాఁ జలించు మొలలేఁతు పచ్చిక బీళ్ళయందు నెమరు పెట్టుట చూపుగల వారి చూపులను సఫలంబులను జేయుచుండును.

శా॥ ఈముల్లోకములందు నెన్నఁగనుగోవే జీవరత్నంబు గో
వే మందారము గోవె మేలుసిరి గోవే భూమి సర్వస్వమం
చే ముమ్మాఱువచింతుగట్టిగను మ్రోయింతున్యశోఢక్క దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ ఈముల్లోకములందున్ - ఎన్నన్ - కన్ - గోవు - ఏ - జీవరత్నంబు - గోవు - ఏ - మందారము - గోవు - ఎ - మేలు - సిరి - గోవు - ఏ - భూమి - సర్వస్వము - అంచు - ఏన్ - ముమ్మాఱు - వచింతున్ - గట్టి - కన్ - ఉ - మ్రోయింతున్ - యశోఢక్కన్ -

ప్ర॥ ఈ ముల్లోకములందున్ = కన్పించుచున్న యీ స్వర్గ మర్త్య పాతాళలోకములయందు, ఎన్నఁగన్ = విచారించిచూడఁగా, గోవే= ఆవే, జీవరత్నంబు = ప్రాణప్రదమయిన మణివంటిది, గోవే = ఆవే, మందారము = కల్పవృక్షము వంటిది గోవె = ఆవే, మేలు = క్షేమముయొక్క స్వరూపము. సిరి = మహాలక్ష్మి, గోవే = ఆవే, భూమి = భూదేవితో సమానమయినది, సర్వస్వము = సర్వధనము, అంచున్ = అనుచు, ముమ్మాఱు = త్రికరణశుద్ధికి గుర్తుగా మూడుపర్యాయములు, గట్టిగన్ = దృఢముగా, వచింతున్ = చెప్పెదను. యశోఢక్కన్, యశః = కీర్తి యను, ఢక్కన్ = చేతితో మ్రోగించు వాద్యవిశేషమును, మ్రోయింతున్ = అందఱకు తెలియునట్లు ప్రకటింతును.

మూఁడులోకములందును విచారించిచూడ గోవే చింతామణి, గోవే కల్పవృక్షము. గోవే శుభస్థానము. గోవే సంపద. గోవే సారవంతిమయిన భూమి. వేయేలా! సర్వధనము గోవేయని త్రికరణశుద్ధిగాఁ జెప్పఁగలను. ఇంతియు కాక గోవుల కీర్తియను ఢక్కను ఎల్లచోట్ల మ్రోయింపగలను.

శా॥ ఆ మంత్రించిన యంతభక్తిని హవిష్యంబున్ లసత్షడ్రస
శ్రీ మిశ్రంబగు భోజనమ్ముల నవిచ్ఛిన్నంబుగా మున్ను వి
శ్వామిత్రుం గృతవీర్యపుత్రు గవి చేయన్లేదె సాశ్చర్యు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ ఆ మంత్రించిన యంతన్ - భక్తిన్ - ఇ - హవిష్యంబున్ - లసత్షడ్రస శ్రీమిశ్రంబు - అగుభోజనమ్ములన్ - అవిచ్ఛిన్నమ్ము - గాన్ - మున్ను - విశ్వామిత్రున్ - కృతవీర్య పుత్రున్ - గవి - చేయన్ - లేదు - ఎ

ప్ర॥ భక్తిన్ = తనయందు గాఢమయిన విశ్వాసముతో. ఆమంత్రించిన యంతన్ = తన్ను సంబోధించి పిలిచినంత మాత్రమున. హవిష్యంబున్ = యజ్ఞములకు భగవన్నివేదనమునకు తగు పదార్థములను, నెయ్యి, పాలు పెరుగులను, లసత్ షడ్రస శ్రీ మిశ్రంబు, లసత్ = ప్రకాశించుచున్నట్టి, షట్ = ఆరువిధములయిన, రస = కారము, పులుపు, తీపి, చేదు, వగరు, ఉప్పు, అను వానియొక్క శ్రీ = రుచిసంపత్తితో, మిశ్రంబు = కలిసియుండునట్లు, అగు భోజనమ్ములన్ = అయినట్టి భోజనములను, అవిచ్ఛిన్నంబు = తెంపు లేకుండునట్లు, మున్ను = పూర్వము, గవి = నందినీధేనువు. విశ్వామిత్రున్ = వశిష్ఠాశ్రమమందు, విశ్వామిత్రుఁడను మునిని, కృతవీర్య పుత్రున్ = జమదగ్ని యాశ్రమమందు, కార్తవీర్యార్జునుని, సాశ్చర్యున్ = ఆశ్చర్యముతోఁ గూడికొనిన వానినిఁగా, చేయున్ లేదె = ఒనరించ లేదా.

పూర్వము వశిష్ఠాశ్రమమందును, జమదగ్ని యాశ్రమమందును నందినీ ధేనువు పిలిచినంత మాత్రమున హవిస్సులను ఆరురసములతో (తీపి, కారము, ఉప్పు, పులుపు, చేదు, వగరు) కూడి కమ్మఁదనము గలిగిన యాహార పదార్థములను వేనవేలు తనియునట్లుగా కల్పించి సైన్యయుక్తుఁడయిన విశ్వామిత్రునకును కార్తవీర్యార్జునునకును మిక్కిలి యాశ్చర్యమును గలిగించెను.

శా॥ కామంబుల్ సఫలంబులన్ సలుపు తోకల్ పొల్చుప్రా
ధాన్యపుం
బ్రామాణ్యంబెఱిగించు శృంగములు నొప్పన్నాల్గుపాదంబులన్
భూమిందిర్గెడు ధర్మదేవతలుకావో ,గోవులెన్నంగ దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ కామంబుల్ - సఫలంబులన్ - సలుపుతోఁకల్ - పొల్చు ప్రాధాన్య పుంబ్రామాణ్యంబు - ఎఱిగించుశృంగములున్ - ఒప్పన్ - నాల్గు పాదంబులన్ - భూమిన్ - తిర్గెడుధర్మదేవతలు - కావు - ఓ - గోవులు - ఎన్నన్ - కన్

ప్ర॥ కామంబుల్ = కోరికలను, సఫలంబులన్ = ఫలములతో (సిద్ధులతో) కూడినవానినిఁగా, సలుపుతోఁకల్ = పొనరించుశక్తిగల పుచ్ఛములును, పొల్చుప్రాధాన్యపుంబ్రామాణ్యంబు, పొల్చు = ప్రకటమయిన, ప్రాధాన్యపుం బ్రామాణ్యంబు = ముఖ్యత్వమువలన మూల స్థానమైయుండుటను, ఎఱిఁగించుశృంగములు = తెలియఁజేయఁగల కొమ్ములును, ఒప్పన్ = తనరుచుండఁగా, గోవులు = ఆవులు, ఎన్నఁగన్ = బాగుగ విచారించి చూడ, భూమిన్ = భూమండలమునందు, తిర్గెడు ధర్మదేవతలు = తిరుగుచున్న ధర్మదేవతలు, కావో = కాకుండునా ? తప్పకయగును.

మఱియును తోఁకలతాఁకుచే సర్వజనుల కోరికలీడేరఁ జేయుచును కొమ్ములచేఁ బ్రాధాన్యమెఱిగించుచు భూమియందు నాల్గుపాదములతోఁ దిరుగు ధర్మదేవతలుగాని విచారించి చూడ గోవులు చతుష్పాదజంతువులు కావు.

శా॥ గోమూత్రంబు సమస్తపాపమయముల్ కుష్ఠాదులంబాచు మా
యామేయంబు భయంబు గోమయము మాయం జేయు గోధూళి ధూ
ళీ మిథ్యాంబుదపంక్తిమారుతము మౌళి స్రక్కలాపేందు దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా। హారహీరాకృతీ!

ప॥ గోమూత్రంబు - సమస్తపాపమయముల్ - కుష్ఠాదులన్ - పాచున్ - మాయామేయభయంబు - గోమయము - మాయన్ - చేయున్ - గోధూళి - ధూళీమిథ్యాంబుదపంక్తిమారుతము - మౌళిస్రక్కలాపేందు దుర్గామల్లేశ్వర.

ప్ర॥ గోమూత్రంబు = పవిత్రమయిన యావుపంచితము, సమస్తపాపమయముల్, సమస్త = వివిధములయినవియు, పాపమయముల్ = పాపముయొక్క స్వరూపములయినవియు, నగు, కుష్ఠాదులన్ = కుష్ఠు మొదలయిన రోగములను, పాచున్ = నశింపజేయును, గోమయము = అవుపేడ, మాయామేయభయంబు, మాయా = మాయవలె విచిత్రములయిన భూతములవల్ల గలుగు. అమేయ=పోల్కిలేని. భయంబు= వెఱపును. మాయన్ = నశించిపోవునట్లుగాను, చేయున్ = పొనరింపజాలును, మౌళి స్రక్కలాపేందు దుర్గామల్లేశ్వర, మౌళి = కిరీటమందు, స్రక్ = పూదండయును, కలాప = అలంకారముగానయిన, ఇందు = రేఖామాత్రచంద్రుడు గల, దుర్గా = కనకదుర్గాదేవి, మల్లేశ్వర = మల్లేశ్వరదేవా! గోధూళి, గో = అవుల కాలిగిట్టలనుండివచ్చు, ధూళి = పరాగము, ధూళీమిథ్యాంబుదపంక్తిమారుతము, ధూళీ = పాపములను, మిథ్యా = వ్యాజముగల, అంబుదపంక్తి = మేఘసముదాయమునకు, మారుతము = మహావాయువు వంటిది.

ఆవుపంచితము పాపరూపములయిన కుష్ఠు మొదలగు నెల్లరోగముల రూపుమాపును. గోమయము మాయవల్లనైన భయమును పోగొట్టును. గోవుల గిట్టలవలన బుట్టుధూళి (దుమ్ము) పాపములను మబ్బులను తుత్తునియలొనర్చుటకు గాలివంటిది.

శా॥ సామోదంబగు గోఘృతంబొసఁగు దీర్ఘాయుష్యమున్ సారమున్
భూమంబుం బొనరించుఁ బాలుదధి సంపూర్ణప్రసాదత్వమున్
ధామంబున్ సమకూర్చు సత్కవిగవీ తౌర్యత్రికస్తుత్య దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా। హారహీరాకృతీ !

ప॥ సామోదంబు - అగు - గోఘృతంబు - ఒసఁగున్ - దీర్ఘాయుష్యమున్ - సారమున్ - భూమంబున్ - పొనరించున్ -- పాలు - దధి - సంపూర్ణప్రసాదత్వమున్ - ధామంబున్ . సమకూర్చున్ - సత్కవిగవీ తౌర్యత్రికస్తుత్య - దుర్గా! - మల్లేశ్వర! సర్వదేవ పరివారా! - హారహీరాకృతీ!

ప్ర॥ సామోదంబు = పరిమళముతోఁ గూడుకొనిన, గోఘృతంబు= ఆవునెయ్యి, దీర్ఘాయువున్ = చాలా కాలము జీవించియుండుటను, ఒసఁగున్ = కలుగఁజేయును, పాలు = ఆవుపాలు, సారమున్ = దేహబలమును మనోబలమును, భూమంబున్ = అధికమయినదానినిగా, పొనరించున్ = చేయును, దధి = ఆవుపెరుగు, సంపూర్ణప్రసాదత్వమున్ = నిండైనస్వచ్ఛత్వమును, ధామంబున్= కాంతివిశేషమును, సత్కవిగవీతౌర్యత్రికస్తుత్య!, సత్కవి = మహాకవులయొక్క, గవీ = ఛందోయుక్తమై రసభావకల్పనాదులతో గూడిన వాఙ్మయముచే, తౌర్యత్రిక = వాద్యగీతనాట్యములచేత, స్తుత్య కొనియాడఁదగిన తల్లీ! తండ్రీ! సమకూర్చున్ = కలుగఁజేయును,

పరిమళముతోఁ గూడిన యావునెయ్యి యాయుష్యమును వృద్ధిఁజేయును. పాలు మిక్కిలి చేవఁగలిగించును. ఆవు పెరుగు ఇంపైన స్వచ్ఛత్వము వర్చస్సు (తేజము) కలిగించును.

శా॥ తామంద ల్వొనరించి గోవుల నమం దానంద సాంద్రాత్ముఁడై
నేమంబొప్పఁగమేత నీరు తఱులన్ నిండించుచున్ గాలి రా
నౌమేరన్ విడియించుచుం గను దయా స్యందుండె ధన్యుండుదు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా। హారహీరాకృతీ!

ప॥ తాన్ - మందల్ - పొనరించి - గోవులన్ - అమందానంద సాంద్రాత్ముఁడు - ఐ - నేమంబు - ఒప్పన్ - కన్ - మేఁత - నీరు - తఱులన్ - నిండించుచున్ - గాలిరాన్ - ఔమేరన్ - విడియించుచున్- కనుదయాస్యందుండు - ఎ - ధన్యుఁడు -

ప్ర॥ తాన్ = తాను, అమందానంద సాంద్రాత్ముఁడు, అమంద = నిండయిన, ఆనంద = సంతోషముచే, సాంద్ర = సంపూర్ణమయిన, ఆత్ముఁడు = హృదయము కలవాఁడు, ఐ = అగుచున్, గోవులన్ = ఆవులను, మందల్ = గుంపులు గుంపులుగా, పొనరించి = ఏర్పఱచి, నేమంబు = నియమము, ఒప్పఁగన్ = ఒప్పునట్లుగా, మేఁత = పచ్చిక మొదలయిన యాహారమును, తఱులన్ = తగిన సమయములయందు, నిండించుచున్ = సమృద్ధమగునట్లు చేయుచు, గాలి = మలయమారుతము, రాన్ = వచ్చుటకు, ఔమేరన్ = అయినట్టి స్థానమునందు, విడియించుచున్ = విశ్రాంతి సుఖమనుభవింపఁ జేయును, కనుదయాస్యందుండె = చూచు కనికరము ప్రవహింపఁ జేయువాఁడె, ధన్యుండు = లోకమునందున్న వారియందఱిలో, మిక్కిలి కృతార్థుఁడని కొనియాడఁబడుచున్నాడు.

ఎవఁడు గోవులను మందలు మందలు (గుంపులు) గాఁ జేర్చిమిక్కిలి యానందముతో పొంగుచు తగువేళల మేఁత నీరు తఱుగ లేకుండ సమకూర్చుచు గాలి బాగుగా వచ్చు ప్రదేశములయందు విడియించుచును కంటకత్తులు వైచుకొని కనిపెట్టుచున్నాడో యాదయా శాలియే ధన్యుఁడని చెప్పనగును.

శా॥ మామేల్మేఁతలకున్కిపట్టులు గదమ్మా బీళ్లు చేల్సేసిర
మ్మా! మర్త్యుల్ వినఁ జెప్పఁజాలముగదమ్మా దిక్కు నీవేగద
మ్మా! మొఱ్ఱన్ వినుమన్న భావము ననంభారావముల్ తెల్పు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ మా మేల్మేఁతలకు - ఉన్కిపట్టులు - కద - అమ్మా! - బీళ్లు - చేల్ - చేసిరి - అమ్మా! - మర్త్యుల్ - వినన్ - చెప్పన్ - చాలము - కద - అమ్మా - దిక్కు - నీవు - ఏ - కద - అమ్మా! - మొఱ్ఱన్ - వినుము - అన్నభావమును - అనన్ - అంభారావముల్ - తెల్పున్ - దుర్గా

ప్ర॥ అమ్మా! = ఓతల్లీ; బీళ్ళు = పచ్చికపట్టుకల ప్రదేశములు, మా మేల్మేఁతలకు - మా మేలైన యాహారపదార్థములకు, ఉన్కిపట్టులు = ప్రధానస్థానములు, కదమ్మా = కదా ఓతల్లీ! మర్త్యుల్ = మనుష్యులు, చేల్ = పంట పండుటకు మాత్రము వలయునట్లు, పంటచేలుగా, చేసిరి = చేసికొనుచున్నారు, కదమ్మా = కదా ఓతల్లీ. దిక్కు = అనాథలమయిన మాకు సదా యాధారము. నీవే = జగజ్జననివైన నీవేకాని మఱెవ్వరును లేరు, వినన్ = మనుష్యులు చెవిఁబెట్టుకొనుటకు, తగునట్లు, మేము = పశుజాతిలో బుట్టినవారము, చెప్పన్ = చెప్పుటకు చాలము = సమర్థత కలవారము కాము, కదమ్మా = కదా ఓతల్లీ, అయినను, తల్లీ, మొఱ్ఱన్ = మా మనవిని. వినుము = ఆలకింపుము, అను భావములను, అంభారావముల్ = అమ్మాయని స్పష్టముగా పిలుచుచు, తెల్పున్ = ప్రకటపఱచుచుండును.

అవులొనర్చు నంభారావముల కర్థమిట్లు తెలియనగును (౧) అమ్మా! దుర్గాదేవీ! బీళ్లు మా మంచిమేఁతల కాధారములైనవి (౨) వానిని చేలుగాఁజేసి మనుష్యులు నేఁడు ధాన్యముల పండించుకొనుచున్నారు (3) దీనిగూర్చి వివరించి నీతో మనవిచేసికొనుటకు మాకమ్మాయనుపదము తప్ప మఱియొపదము నుండదు (౪) కావున మా మొఱను విని రక్షింపగలతల్లి నీవుతప్ప మఱెవ్వరును గానబడరు.

శా॥ తామున్నర్జునుఁడై వధంబునకు శ్రద్ధం గొన్న యస్త్రంబు వి
ల్గా మాంసంబును బెట్టి సాహసికతం గన్నిచ్చి కన్నప్పయై
నీమెచ్చుంగొని కాళహస్తినిలఁడే నీమ్రోలఁ దిన్నండు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా ! హారహీరాకృతీ!

ప॥ తాన్ - మున్ను - అర్జునుఁడు - ఐ - వధంబునకు - శ్రద్ధన్ - కొన్న యస్త్రంబు - విల్ - కాన్ - మాంసంబున్ - ఉ - పెట్టి - సాహసికతన్ - కన్ను - ఇచ్చి - కన్నప్ప - ఐ - నీ మెచ్చున్ - కొని - కాళహస్తిన్ - నిలఁడు - ఏ - నీమ్రోలన్ - తిన్నండు - దుర్గా! మల్లేశ్వర!

ప్ర॥ తాన్ = తాను, మున్ను = హస్తినా పట్టణమందు పుట్టినప్పుడు, అర్జునుఁడై = అర్జునుఁడను పేరుకలవాఁడయి, శ్రద్ధన్ = తపస్సునందు కృష్ణద్వైపాయనుఁడు చెప్పినట్లు సలిపినపట్టుదలచే, కొన్నయస్త్రంబు = ద్వంద్వయుద్ధమునందు పరమేశ్వరుని నిన్ను మెప్పించి చేకొనిన పాశుపతమను పేరుగల యస్త్రరాజము, విల్ = ధనుస్సు, కాన్ = ఐనదిగాను, మాంసంబున్ = పంది అస్థులును, పెట్టి = అనుభవింపఁజేసి, సాహసికతన్ = పరీక్షార్థియయిన శివుకంటియందు నెత్తురు ధారగాఁ జూపింపఁ దెంపును జూపింపఁ గలవాఁడగుటచేత. కన్నిచ్చి = తనకన్ను నీకంటియందు గూర్చి, కన్నప్పయై = కన్నప్పయను బిరుదునీచే పొందినవాఁడై. తిన్నఁడు = నాథనాథునకు తండెరు పుట్టుల కొడుకగు తిన్నండు, నీ మెచ్చున్ = నీ మెప్పును, కొని = కాంచి, కాళహస్తిన్ = కాళహస్తియందు, నీ మ్రోలన్ = నీయెదుట, నిలఁడే = నిలిచియుండఁడా.

పూర్వమర్జునుఁడు జ్ఞాతివధార్థ మీశ్వరునివలన బడసిన పాశుపతమను మహాస్త్ర మీ జన్మమున ధనుస్సుగాధరించి భక్తివిశేషముచేఁ బరమేశ్వరునిచే బందిమాంసము దినిపించి యాయన తన్నుఁ బరీక్షింప లింగములో నెత్తురు గారు కంటియందు తన కన్నొసంగి కన్నప్పయైన నాథనాథుని కొడుకు తిన్నఁడు కాళహస్తిలో నీమ్రోల నెలకొని యున్నాఁడు.

శా॥ ఏమీయంచును నెల్ల రబ్రపడఁ బై కేతెంచు వైవస్వతున్
వామాంఘ్రింబడఁదన్ని యేలుకొనవే బాలున్ మృకండూద్భవున్
నామప్రీణిత సర్వలోక! సహజానందా! దయాకంద! దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ ఏమీ - అంచున్ - ఉన్ - ఎల్లరు - అబ్రపడన్ - పైకి - ఏతెంచు వైవస్వతున్ - వామాంఘ్రిన్ - పడన్ - తన్ని - ఏలుకొనవు - ఏ - బాలున్ - మృకండూద్భవున్ - నామప్రీణిత సర్వలోక!- సహజానందా!- దయాకంద!- దుర్గా! మల్లేశ్వర! సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!-

ప్ర॥ ఏమీయంచునన్ = ముక్కున వ్రేలిడియేమి యంచును, ఎల్లరు = మహర్షులు దేవతలును, అబ్రపడన్ = ఆశ్చర్య పడుచుండఁగా, పైకి = మార్కండేయుని మీదికి, ఏతెంచు వైవస్వతున్ = దుముకుచు వచ్చు యమధర్మరాజును, వామాంఘ్రిన్ = ఎడమ కాలితో, పడన్ = పడిపోవు నట్లుగా, తన్ని = కొట్టి, మృకండూద్భవున్ = మృకండు మహర్షి కుమారుఁడయిన, బాలున్ = పిన్న వయస్సు కలవానిని (మార్కండేయుని), నామప్రీణిత సర్వలోక, నామ = కోట్లకొలఁది రూపములతో నున్న 'మహాదేవ' మొదలయిన నామము లుచ్చరించుట చేత, ప్రీణిత = సంతోష పెట్టఁబడిన, సర్వలోక = పదునాల్గు భువనములు కల తల్లీ! తండ్రీ!, సహజానందా = ఏదేశమునం దేకాలమునం దేవ్యాపారమునం దున్నను వదలక యనుభవింపఁబడు నిరతిశయానందము కల, దయాకంద! = కనికరపు గనియైన తల్లీ! తండ్రీ! ఏలుకొనవే = రక్షింపలేదా!

బ్రహ్మ యిచ్చిన యాయుర్దాయము కడచిన వెంటనే పాశము చేఁ బూని తన ప్రాణములను తీసికొని పోవచ్చిన యముని నెడమ కాలితోఁ దన్ని పడఁగొట్టి మహర్షుల యాశీర్వాద బలమును నిలిపి మృకండు కొడుకగు మార్కండేయుని రక్షింపలేదా.

శా॥ చామంతుల్ విరిమల్లె బిల్వములు లక్షల్ కోట్లు పూఁదోఁటలన్
సామీచీన్యముగాఁగఁ గూర్చుకొని స్వచ్ఛంబైన డెందాన నీ
నామంబుం బ్రణవంబునుం గలిపి రాణన్ భక్తిఁ బూజింతురు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా ! హారహీరాకృతీ!

ప॥ చామంతుల్ - విరిమల్లె - బిల్వములు - లక్షల్ - కోట్లు - పూఁదోఁటలన్ - సామీచీన్యము - కాన్ - కన్ - కూర్చుకొని - స్వచ్ఛంబు - ఐన డెందానన్ - నీనామంబున్ - ప్రణవంబున్ - ఉన్ - కలిపి - రాణన్ - భక్తిన్ - పూజింతురు -

ప్ర॥ చామంతులున్ = హేమంతలక్ష్మి కలంకారములయిన చేమంతి పూవులు, విరిమల్లె = వసంత సమయలక్ష్మి చిఱునవ్వువంటి మల్లికా కుసుమహాలు, బిల్వములు = గౌరీరూపమునను న్న నీచే నీయఁబడిన విత్తనము వలన భూమండలమున నెల్లచోట్ల జనించి శుభపరంపరలఁ గలిగించు మారేడు దళములు, మొదలయినవి, లక్షల్ = లక్షలకొలఁదిగాను, కోట్లు = కోట్లకొలఁదిగాను, పూఁదోఁటలన్ = పూలతోటలనుండి, సామీచీన్యముగాఁగన్ = చీడ ముడుత వాడుట మొదలయిన దోషములు లేకుండు నట్లుగా, కూర్చుకొని = సేకరించుకొని, స్వచ్ఛంబు = పరిశుద్ధమయిన, డెందానన్ = మనస్సునందు, నీనామంబున్ = నీనామమును, ప్రణవంబున్ = ఓమ్ కారమును, కలిపి = ఏకమొనర్చి, రాణన్ = ఒప్పిదమయిన పద్ధతితో, భక్తిన్ = నీపాదపద్మముల వదలని మనోవృత్తితో, పూజింతురు = పూజచేయుచుందురు.

చేమంతులు, మల్లియలు, మారేడు దళములు మొదలయిన వానిని పూదోటలనుండి కొనితెచ్చి కూర్చుకొనిన లక్షపూజలు కోటిపూజలు నీ మంత్రమును ప్రణవముతోఁ గలిపి జపించుచు నెఱపుచుందురు.

శా॥ తామిస్రంబునఁ గూలనీయదు శుభస్థానంబునన్నిల్పు సు
శ్రీమేల్గూర్చు నదల్చు భూతభయముల్ శీఘ్రంబు భక్తిప్రసూ
నామోదంబున గండుతేఁటియగు రుద్రాక్షంబు భద్రాక్ష దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ తామిస్రంబునన్ - కూలనీయదు - శుభస్థానంబునన్ - నిల్పున్ - సుశ్రీన్ - మేల్గూర్చున్ - అదల్చున్ - భూతభయముల - శీఘ్రంబు - భక్తిప్రసూనా మోదంబునగండు తేఁటి - అగున్ - రుద్రాక్షంబు - భద్రాక్ష దుర్గామల్లేశ్వర!

టీ॥ భద్రాక్ష = శుభములను కలిగించు చూపుగల తల్లీ! తండ్రీ! రుద్రాక్షంబు = రుద్రాక్షలు, (జాత్యేక వచనము) తామిస్రంబునన్ = తామిస్రమను పేరుకల నరకమునందు, కూలనీయదు = పడిపోకుండఁ గాపాడఁగలదు, శుభస్థానంబునన్ = మేలైన పదవియందు(నిల్పున్ = నిలుపఁబెట్టును, సుశ్రీన్ = విలువయిన సంపదను వర్షిస్సును, మేల్గూర్చున్ = కలుగఁజేయును, శీఘ్రంబు = వెంటనే, భూతభయముల్ = పిశాచాదుల వల్లనైన జంకును, అదల్చున్ = నిశ్శేషముగా నశింపఁజేయును, భక్తి ప్రసూనామోదఁబున గండుతేఁటి, భక్తి = మీయందలి నిశ్చల భక్తియను, ప్రసూన = పుష్పవిశేషము యొక్క, ఆమోదంబునన్ = పరిమళమునందు, గండుతేఁటి = గండుతుమ్మెద, అగున్ - ఆగును.

రుద్రాక్షలు ధరించినవారిని నరకకూపమునఁ బడనీక రక్షించును. మేలునందు నెలకొల్పును. సంపదలను కలిగించును. వెంటనే గాలిభయమును పోఁగొట్టును. భక్తియను పుష్పముమీద గండుతుమ్మెదయై రసముఁ గ్రోలు చుండును,

శా॥ నీమూర్ధంబునఁ బొల్చుచంద్రరుచియై నీర్యజ్జటాజూటగం
గా మోఘాంబుఝరీప్రకాశ మయి భద్రాయుః కుమారాత్మతే
జో మూలంబగు భస్మమెన్నఁదరమా శుద్ధాంతరంగస్థ దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ నీ మూర్ధంబునన్ - పొల్చుచంద్రరుచి - ఐ - నీర్యజ్జటా జూట గంగా మోఘాంబు ఝరీ ప్రకాశము - అయి - భద్రాయుః కుమారాత్మ తేజోమూలంబు - అగుభస్మము- ఎన్నన్ - తరము- ఆ - శుద్ధాంతరంగస్థ -

ప్ర॥ నీ మూర్ధంబునన్ = ఆకాశ రూపమయిన నీతలయందు, పొల్చు చంద్రరుచి, పొల్చు = ప్రకాశించు, చంద్ర = బాలచంద్రుని యొక్క, రుచి = వెన్నెల, ఐ - అగుచు, నిర్యజ్జటా జూటగంగా మోఘాంబు ఝరీ ప్రవాహము, నిర్యత్ = పైనుండి జాలుగా బయలుదేటి, జటాజూట = జడల గుంపునందు నెసఁగు, గంగా = గంగానదియొక్క, అమోఘ = అడ్డులేని, అంబు = ఉదకములయొక్క, ఝరీ = ప్రవాహము యొక్క, ప్రకాశము= కాంతి విశేషము, అయి = అగుచు, భద్రాయుః కుమారాత్మ తేజోమూలంబు, భద్రాయు వను రాజ కుమారునకు (సవతి తల్లులు పెట్టించిన విషముచే నశించుటకు సిద్ధపడిన వానికి) ఆత్మ = స్వకీయమయిన, తేజః = క్షాత్ర ప్రకాశము బ్రహ్మ వర్చస్సును కలిగించుటకు, మూలంబు = కారణము, అగు భస్మము = అయిన విభూతి, శుద్ధాంతరంగస్థ = పరి శుద్ధమయిన హృదయ మందుండు తలిదండ్రులారా, ఎన్నన్ = ఎంచుటకు, తరమా = శక్యమగునా?

మీ తలయందలి చంద్రుని వెన్నెలవలె జడలయందు జాల్కొని ప్రవహించు గంగా ప్రవాహము రీతి స్వచ్ఛమై శత్రువు తినిపించిన విషముచేఁ గృశించిన భద్రాయువను రాజ కుమారునకు సంపూర్ణాయురారోగ్యములను బుషభ యోగీశ్వరుని వలనఁ బడయఁజేసిన భస్మ ప్రభావము చెప్పశక్యమగునా?.

శా॥ ఆమోక్షంబను సౌధమెక్కుటకు నగ్ర్యంబైన సోపాన మా
యీమూర్తుల్ కనుదోయిఁదోఁచునవినీవేయంచుబోధించుఁజూ
నీమంత్రంబు చరాచరప్రకట జన్మిస్తోమజప్యంబు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా ! హారహీరాకృతీ!

ప॥ ఆమోక్షంబు - అను సౌధము - ఎక్కుటకున్ - అగ్ర్యంబు - ఐనసోపానము - అయీమూర్తుల్ - కనుదోయిన్ - తోఁచున - నీవు - ఏ - అంచున్ - బోధించున్ - చూ - నీ మంత్రంబు - చరాచరప్రకట జన్మిస్తోమ జప్యంబు - దుర్గా! - మల్లేశ్వర!.

ప్ర॥ నీ మంత్రంబు = నీ సంబంధమయిన మంత్రంబు (పంచాక్షరి) ఆమోక్షంబు, ఆ=సుప్రసిద్ధమయిన, మోక్షంబు= మోక్షము, అను సౌధము= అనునట్టి మేడను, ఎక్కుటకున్=ఆరోహించుటకు, అగ్ర్యంబు= మొట్టమొదలిది యయిన, సోపానము = మెట్టు, అయీమూర్తుల్ = పదునాలుగు లోకముల యందలి యాకారములన్నియు, కనుదోయిన్ = కన్నుగవయందు, తోఁచునవి=స్ఫురించునవి యెల్లను,నీవే యంచున్=నీవనుచు,బోధించుఁజూ= తెలియఁజేయుచుండును కాబట్టి, చరాచర ప్రకటజన్మిస్తోమ జప్యంబు, చరాచర = స్థావరజంగమ రూపముగానుండి, ప్రకట = స్ఫుటముగా దెలియుచున్న, జన్మి = ప్రాణులయొక్క, స్తోమ = సమూహముచేత, జప్యంబు = సర్వకాలమును వదలక జపింపఁదగి యున్నది.

పంచాక్షరి. మోక్షమను మేడయెక్కుటకు పై మెట్టు-కదలునవియును కదలనివియును నగు ప్రపంచములలోని ప్రాణులందు రత్నమాలికలోని సూత్రము (దారము) వలెనున్న మీ స్వరూపమును జూపించును.

శా॥ భూమిన్మర్త్యుని నెన్నుచో రసనయేమో పల్కఁబిట్టుల్కు నీ
దౌ మాహాత్మ్యము నెన్నఁబూనఁగ సహస్రాకారముల్
పూనుమే
మే మేమేయని శబ్దముల్ తమకుతామే సన్నిధింజేయు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ భూమిన్ – మర్త్యునిన్ – ఎన్నుచోన్ – రసన – ఏమి – ఓ – పల్కన్ – బిట్టు – ఉల్కున్ నీది – ఔ మాహాత్మ్యమున్ – ఎన్నన్ – పూనఁగన్ – సహస్రాకారముల్ – పూనున్ – మేము – ఏ – మేము – ఏ – అని – శబ్దముల్ – తమకు – తాము – ఏ – సన్నిధిన్ – చేయున్ –

ప్ర॥ భూమిన్ = భూమండలమందు, మర్త్యునిన్ = ఒకానొక మనుష్య మాత్రుని, ఎన్నుచోన్ = స్తోత్రము చేయుటకు ప్రారంభము చేయునప్పుడు, రసన = నానాలుక, ఏమో = ఎందుకో, బిట్టుల్కున్ = మిక్కిలి భయపడి మానిన ట్లుండును, నీది = నీ సంబంధమయిన, మాహాత్మ్యము = మహా మహిమను, ఎన్నన్ = స్తోత్రమొనర్చుటకు, పూనఁగన్ = ప్రారంభము చేయుచుండఁగనే, రసన = ఆ నాలుక, సహస్రాకారముల్ = అనేకములయిన యాకారములను, పూనున్ = వహించును, శబ్దముల్ = నాజిహ్వయందు వ్యాకరణాది సంస్కారములు కల శబ్దములన్నియు, మేమే మేమే = మేము మేము ముందు వచ్చితిమి మమ్ము గ్రహింపుడని, తమకు తామే = పిలువకయే స్వయముగా తామే వచ్చి, సన్నిధిచేయున్ = నాకు సమీపమున వచ్చి, స్ఫురించుచుండును.

ఈ ప్రపంచమం దొక నరుని స్తోత్రముఁజేయఁ బూనుకొన నా నాలుక పను కాదు చుండును. నీ మాహాత్మ్యమును వర్ణింపఁ బూనుకొన నొక రూపముచాలక తనకు లెక్కపెట్టుటకు వీలుకానిరూపములు కావలయునని కోరుచుండును. శబ్దములన్నియు మమ్ము ప్రయోగింపుము మమ్ము ప్రయోగింపు మని తమకుతామే యెదుటకు వచ్చి నిలబడు చుండును.

శా॥ లేమిన్లేమిఁబొనర్పఁగాఁ గలుగు కల్మిన్నీసఖుంబోలి సు
త్రాముండోయన భూరిభోగములఁ బూర్ణత్వమ్మునం గ్రాలినన్
నీమూర్తిన్ వెలిలోనఁ జూడనియెడన్ నిన్ జేరఁగాలేఁడు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ లేమిన్ - లేమిన్ - పొనర్పన్ - కాన్ - కలుగుకల్మిన్ - నీసఖున్ - పోలి - సుత్రాముండు - ఓ - అనన్ - భూరిభోగములన్ - పూర్ణత్వమ్మునన్ - క్రాలినన్ - నీమూర్తిన్ - వెలిన్ - లోనన్ - చూడనియెడన్ - నిన్ - చేరన్ - కాన్ - లేఁడు -

ప్ర॥ లేమిన్ = దారిద్ర్యమును, లేమిన్ = లేనిదానినిగా, పొనర్పగాన్ = చేయుటకు, కలుగుకల్మిన్ = సమగ్రయయిన సిరియందు, నీసఖున్ = నీ చెలికాఁడయిన నిధిపతికుబేరుని, పోలి = పోలుచు. సుత్రాముండో = దేవదేవేంద్రుఁడో, అనన్ = అనుకొనునట్లుగా, భూరిభోగములన్ = గొప్పభోగములయందు, పూర్ణత్వమ్మునన్ = నిండుదలతో, క్రాలినన్ = ఒప్పుచుండినను, నీ మూర్తిన్ = సర్వవ్యాపకత్వయ మొనర్చు నీ దివ్యమంగళ విగ్రహమును, వెలిన్ = బాహ్య ప్రపంచమునను, లోనన్ = అంతర ప్రపంచమునను, చూడనియెడన్ = చూడకున్నయెడల, నిన్ = నీలోపలను, చేరఁగాలేడు = ప్రవేశింప సమర్థుఁడు కాఁజాలఁడు.

యాచకుల పేదతనము పోగొట్టుటకు నీస్నేహితుఁడయిన కుబేరునితో సమానుఁడైనను, భోగముల ననుభవించుటకు భూలోక దేవేంద్రుఁడను పేరు గాంచినను, మీ స్వరూపమును లోపల వెలపలఁ జూడనియెడల మీ స్థానము జేరఁజాలఁడు.

శా॥ భూమీధ్రమ్ముల గల్పఁజాలిన భుజాపుష్టి న్మరుత్సూనుఁడే
యై మార్తాండునిఁ బోలె శాత్రవులఁ దైక్ష్ణ్యంబుఁ బ్రదర్శించినన్
భీముండే యయిన న్రణమ్మునను నిన్ సేవింపకెట్లొప్పు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ భూమీధ్రమ్ములు - అగల్పన్ - చాలిన భుజాపుష్టిన్ - మరుత్సూనుఁడు - ఏ - ఐ మార్తాండునిఁబోలన్ - శాత్రవులన్ - తైక్ష్ణ్యంబున్ - ప్రదర్శించినన్ - భీముండు - ఏ - అయినన్ - రణమ్మునన్ - ఈ - నిన్ - సేవింపక - ఎట్లు - ఒప్పున్ -

ప్ర॥ భూమీధ్రమ్ములు = కొండలను, అగల్పన్ = పగులగొట్టుటకు, చాలిన భుజాపుష్టిన్, చాలిన= సమర్థత్వముకల, భుజా=బుజముల యొక్క, పుష్టిన్ = బలముచేత, మరుత్సూనుఁడే = రెండవ వాయు కుమారుఁడే (అంజనేయుఁడు), ఐ = అగుచు, మార్తాండునిఁబోలన్ = సూర్యునివలె, శాత్రవులన్ = శత్రువుల విషయమందు, తైక్ష్ణ్యంబున్ = చురుకుదనమును, ప్రదర్శించినన్ = ప్రకటించినను, రణమ్మునను= యుద్ధమునందు, భీముండే= భీముఁడను పేరుగల నీవంటివాఁడే, అయినన్ = అయినప్పటికి, నిన్ = నిన్ను, సేవింపక = కొలువక, ఎట్లు = ఏవిధముగా, ఒప్పున్ = తగును.

కొండలను పిండిచేయఁజాలిన, భుజబలమందు రెండవ హనుమంతుఁడే యయినను సూర్యునివలె శత్రువులయందుఁ జురుకు దనమును జూపించువాఁడే యయినను, నిమ్ము సేవింపకున్న మానవత్వము నిలువదు.

శా॥ ఏముం జాసల్పిన కర్మమేతనువు నాకెచ్చోటఁ జేకూర్చినన్
స్వామీ నాకట తెప్పపాటయిన నన్యభ్రాంతికింగాక నీ
నామమ్మున్ స్మృతినిల్వఁ జేయఁగదె చిన్నాళీకమత్తాళి దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ ఏన్ - మున్ - సల్పినకర్మము - ఏతనువున్ - నాకు - ఎచ్చోటన్ - చేకూర్చినన్ - స్వామీ - నాకు - అట - తెప్పపాటు - అయినన్ - అన్యభ్రాంతికిన్ - కాక - నీ నామమ్మున్ - స్మృతిన్ - నిల్వన్ - చేయన్ - కద - ఎ - చిన్నాళీకమత్తాళి! - దుర్గామల్లేశ్వర! - సర్వదేవపరివారా! - హారహీరాకృతీ!

ప్ర॥ ఏన్ = నేను, మున్ = వెనుకటి జన్మమందు, సల్పినకర్మము= చేసినకర్మము,ఏతనువున్ = ఏశరీరమును,నాకు= నాకు, ఎచ్చోటన్= ఏస్థానమం నందు, చేకూర్చినన్ = కలుగఁ జేసినప్పటికిని, స్వామీ! = ఓజగత్ప్రభూ! అటన్ = అ శరీరము ధరించియున్నపుడు, నాకు = చేసిన కర్మమునకు తగిన ఫలమనుభవించు నాకు, తెప్పపాటయినన్ = కన్నుమూసి కన్ను తెఱచునంతటి కాలమైనను, అన్యభ్రాంతికిన్ = ఇతర దేవతలు రక్షింతురను భ్రమకు, కాక = వశముగాక, నీ నామమ్మున్ = ఎల్లవారిని దరింపఁజేయఁ గల్గిన నీ పవిత్రమయిన నామమును, స్మృతిన్ = తలంపునందు, నిల్వన్ = నిల్చునట్లుగా, చిన్నాళీకమత్తాళి!, చిత్ = జ్ఞానమనెడు, నాళీక = పద్మము నందు, మత్తాళి! = గండుతుమ్మెద యయినతండ్రీ! చేయఁగదె = చేయుమని ప్రార్థించుచున్నాడు.

తా: ముచేసిన కర్మమునకు తగినది యేరూపము వచ్చినను ఏస్థానమందు న్నను నచ్చట సంచలనము లేకుండ నిప్పటియట్లు యితరచింతనము లేక సర్వ కాలము నీ నామస్మరణ కొనసాగునట్లనుగ్రహింపుము,

శా॥ సౌమంగల్యము పట్టుగొమ్మ సుకలాసంపల్లతాకేళికా
రామశ్రీ జగతీత్రయీస్థిత సతీరత్నపరికాళంబు పూ
జా మూలంబుహరిద్రమాంగళిక సంస్థానం బనూనంబు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ సౌమంగల్యము పట్టుగొమ్మ - సుకలా సంపల్లతా కేళికి - ఆ రామశ్రీ - జగతీత్రయీస్థిత సతీరత్న పరికాళంబు - పూజామూలంబు - హారిద్ర - మాంగళిక సంస్థానంబు - అనూనంబు - దుర్గా! - మల్లేశ్వర !

ప్ర॥ సౌమంగల్యము పట్టుగొమ్మ, సౌమంగల్యము= ముత్తైదువ తనమునకు, పట్టుగొమ్మ = నివాసస్థానము, సుకలా సంపల్లతా కేళికి, సుకలా = కాంతి విశేషముల చేరి, సంపత్ = శ్రీలను, లతా = తీవెలయొక్క, కేళికి = విలాసమునకు, ఆరామశ్రీ, ఆరామ = పూదోటయొక్క, శ్రీ = లక్ష్మి వంటిదియు, జగతీత్రయీస్థితసతీరత్న పరికాళంబు, జగతీత్రయీ = మూడు లోకములయందు, స్థిత = ఉన్నటువంటి సతీరత్న = పతివ్రతలను మణులను, పరికాళంబు = కాంతి వంటిదియు, పూజామూలంబు, పూజా = దేవతలను పూజించుటకు, మూలంబు = సాధనమైనదియు, మాంగళిక సంస్థానంబు, మాంగళిక = శుభములను కలిగించు వస్తువులయందు. సంస్థానంబు = ప్రధానమయినదియు, అనూనంబు = తక్కువ కానిదియును, హారిద్ర = పసపుగా కన్పించు చున్నది.

పసపు. ముత్తైదువతనమునకు నిలయము. మంచి కళలు సంపదలను తీగలకు పూదోటవంటిది. మూల్లోకములందలి ముత్తైదువులకును పరికాళము కలిగింపం జాలినది. తఱుగనిది. శుభములకు, ముఖ్యస్థానమైనది.

శా॥ శ్రీమంతంబు పతివ్రతాస్యతిలకశ్రీ సాంధ్యరాగ ప్రవా
ళామేయారుణిమప్రకృష్టము హరిద్రాంతస్సముద్భూత ము
ద్దామప్రఖ్యము కుంకుమమ్ము సకలాంతర్యామిచిత్సాక్షి దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ శ్రీమంతంబు - పతివ్రతాస్యతిలకశ్రీ - సాంధ్యరాగ ప్రవాళా మేయారుణిమ ప్రకృష్టము - హారిద్రాంతస్సముద్భూతము - ఉద్దామ ప్రఖ్యము - కుంకుమమ్ము - సకలాంతర్యామి! - చిత్సాక్షి - దుర్గా! - మల్లేశ్వర - సర్వదేవపరివారా! - హారహీరాకృతీ! -

ప్ర॥ శ్రీ మంతమ్ము=కలావిశేషముకల, కుంకుమమ్ము= కుంకుమమను పూజ్యపదార్థము, పతివ్రతాస్యతిలకశ్రీ, పతివ్రతా = పతివ్రతలయొక్క, అస్య = ముఖములయందు, తిలక = బొట్టురూపుకల, శ్రీ = లక్ష్మియైనది, సాంధ్యరాగ ప్రవాళామేయారుణిమ ప్రకృష్టము, సాంధ్యరాగ = సంజ కెంజాయయొక్క, ప్రవాళ = పగడములయొక్క, అమేయ = పోలిక లేనట్టి, అరుణిమ = ఎఱ్ఱదనమునందు, ప్రకృష్టము = గొప్పదైనది, హారిద్రాంతస్సముద్భూతము, హారిద్రాంతః=పసపులోపలనుండి, సముద్భూతము= సంభవించుచున్నది, సకలాంతర్యామి= అన్నిటియందు లోపలను తిరుగుచు, చిత్సాక్షి, చిత్ = జ్ఞానస్వరూపమును, సాక్షి = అన్నిటిని కనిపెట్టియుండు రూపమునునైయున్న తలిదండ్రులారా! ఉద్దామ ప్రఖ్యము = అధికమయిన ప్రసిద్ధికలదియునై యున్నది.

కుంకుమము శోభకలది. పతివ్రతల ముఖములం దలంకారలక్ష్మియైనది. సంజకెంజాయ వలెను పగడములవలెను ఎఱ్ఱదనము కలది. పసపునుండి సంభవించునది (రూపాంతరము) మిక్కిలి ప్రశస్తిఁగాంచినది.

శా॥ ఏమోత్రవ్వుకొనుఁ గతంబులను ముందింతైనఁ జింతింపఁడా
పై మిన్ముట్టునొకప్డు రిత్తగను డోలాందోళితాంతస్స్థితిన్
నీమన్కి న్గనుటెట్లు నిన్దలఁచుపూన్కిన్నిల్చుటెట్లౌను దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా ! హారహీరాకృతీ!

ప॥ ఏమోత్రవ్వుకొనున్ - గతంబులన్ - ఉ - ముందు - ఇంత - ఐనన్ - చింతింపఁడు - ఆపై - మిన్ముట్టున్ - ఒకప్డు - రిత్త - కనున్ - డోలాందోళి తాంతస్స్థితిన్ - నీమన్కిన్ - కనుట - ఎట్లు - నిన్ - తలచుపూన్కిన్ - నిల్చుట - ఎట్లు - ఔను - దుర్గా! - మల్లేశ్వర!

ప్ర॥ గతంబులను = జరిగిపోయిన వానిని, ఏమో = చెప్పుటకు శక్యము కానివి, త్రవ్వుకొనున్ = మాటిమాటికిని తూచాతప్పక చెప్పుకొను చుండును, ముందు = మీదఁజేయఁ దగినదానిని, ఇంతైనన్ = కొంచియు మైనను, చింతింపఁడు = ఆలోచింపఁడు, ఆపై = ఆ తరువాత, ఒకప్డు = ఒకొక్క సమయమునందు, మిన్ముట్టున్ = పొంగి పై కెగయుచుండును, ఒకప్డు = ఒకానొక సమయమందు, డోలాందోళితాంత స్స్థితిన్, డోలా = ఊయెలవలె, ఆందోళిత = అటునిటు తిరుగునట్టి, అంతస్స్థితిన్ = మనో వ్యాపార వృత్తిచే, రిక్త = వ్యర్థముగా, కనున్ = చూచుచుండును. నీమన్కిన్ = నీస్థానమును, కనుట = చూచుట, ఎట్లు = ఏవిధము. నిన్ = నిన్ను = తలఁచుపూన్కిన్ = స్మరించుటయందేర్పడిన పట్టుదలయందు, నిల్చుట = ఉండుట, ఎట్లు = ఏవిధముగా, ఔను = అగును ?

లోకమందలి మనుజులు కడచిపోయిన వానినే పలుమారులు పూస గ్రుచ్చినట్లు వాక్రుచ్చుచుందురు. కాని పెద్దపులివంటి ముగలితనమునంబడి మృత్యుముఖము జేరనున్న తాము ముందు చేసికొనవలసిన రీతిని నించుకేనిఁ దలంపరు. ఒకప్పుడు పైకెగురుటయు, మరొకప్పుడు విచారమను నూయెల లో నూగుటయు గలవారు నీనామస్మరణముఁ జేయఁజాలరు. మీస్థానము నెలకొను దీక్షను వహింపఁజాలరు.

శా॥ తామేల్పట్టుననున్న యప్పు డనుభూతంబైన దానిన్ జగ
త్క్షేమమ్మున్ బొనరించుపొంటె సలుపన్ జెల్లున్ విచారింప నే
నే మేధానిధినన్న గర్వమగునేని న్నిల్వదా పట్టు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ తాన్ - మేల్పట్టునన్ - ఉన్నయప్పుడు - అనుభూతంబు - ఐనదానిన్ - జగత్క్షేమంబున్ - పొనరించుపొంటెన్ - సలుపన్ - చెల్లున్ - విచారింపన్ - నేను - ఏ - మేధానిధిన్ - అన్నగర్వము - అగున్ - ఏనిన్ - నిల్వదు - ఆపట్టు - దుర్గా!

ప్ర॥ తాన్ = అందఱికంటె విశేషములను తెలిసినతాను, మేల్పట్టునన్ = మంచిస్థానమునందు, ఉన్నయప్పుడు = వర్తించు కాలమునందు, అనుభూతం బైనదానిన్ = తనకనుభవము బాగుగాఁగలిగిన విషయమును, జగత్క్షేమంబున్ = లోకమునకు మేలును, పొనరించుపొంటెన్ = చేయుట కొఱకు, సలుపఁజెల్లున్ = చేయుటయుక్తముగా నుండును, విచారింపన్ = పరికించి చూచిన, నేనే = నేనొక్కఁడనే, మేధానిధిన్ = చుఱుకైయున తెలివితేటలకు గనివంటివాఁడను, అన్నగర్వము = అనునట్టి యతిశయ భావము, అగునేనిన్ = అయినయెడల, ఆపట్టు = తనకు లభించిన గొప్ప పదవి, నిల్వదు = స్థిరముగా నుండదు.

తానొక మంచిస్థానమున నున్నప్పుడు లోకక్షేమమునకై తనకు తెలిసినంతవఱకు లోపములేకుండ నితరులకు, నడిగిన దానిని బోధింపనగును. అట్లు కానిచో మీఁది స్థానమును లభించినదానిని దక్కించుకొనఁజాలఁడు.

శా॥ ఏమంచున్వచియింపఁజెల్లునకటా యీయింద్రియాభోగముల్
చీమల్ దోమలుగూడఁ బాలుగొను నిస్సీలెస్సలోనెంచి తా
నీమెట్టెక్కు నుపాయమెల్లపుడు నన్వేషింపనౌఁగాదె దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా! హారహీరాకృతీ!

ప॥ఏమి - అంచున్ - వచియింపన్ - చెల్లున్ - అకట - ఈ - ఈ యింద్రియా భోగముల్ - చీమల్ - దోమలున్ - కూడన్ - పాలు కొనున్ - ఇస్సీ - లెస్స - లోన్ - ఎంచి - తాన్ - నీమెట్టు - ఎక్కు నుపాయము - ఎల్లపుడున్ - అన్వేషింపన్ - ఔన్ - కాదు - ఎ - .

ప్ర॥ ఈ యింద్రియా భోగముల్ = పశుపక్షిమానవాదులయందును సమమయిన తృప్తిస్థానముగల శబ్దస్పర్శ రూప రసగంధాదుల యనుభవము అను, చీమల్ = సూక్ష్మరూపములయిన చీమలు, దోమలు = అట్టివేయగు దోమలు, కూడన్ = సయితము, పాలుగొనున్ = మనఃపూర్వకముగాఁ బ్రయత్నించును, ఇస్సీ!= నిందింపఁదగినది. లెస్స = ఈవిషయమును బాగుగా, లోన్ = తన హృదయమునందు, ఎంచి = విమర్శించుకొని, తాన్ = దుర్లభమయిన మనుష్యజన్మమందిన తాను, నీమెట్టు = నీస్థానమును, ఎక్కు నుపాయము = చేరువీలు, ఎల్లపుడున్ = సర్వవేళలయందును, అన్వేషింపన్ = శోధించుటకు, ఔఁగాదె = ఒప్పియుండునుగదా.

ఇంద్రియములు. (శరీరము, కన్ను, చెవి, నాలుక, ముక్కు) (వాక్కు చేయి పాదము పాయువు ఉపస్థ) పదియును (జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు) మనస్సుతోఁగలిసి శబ్ద స్పర్శ రూప రసగంధములకులోఁబడుఁగాని, నీస్థానముఁజేరు నుపాయముగమనింపఁజాలవు. ఇందేమియు గొప్పలేదు. చీమలు దోమలు సయితి మీ యింద్రియసుఖముల ననుభవించుచున్నవి. ఈ విషయము బాగుగా విమర్శించి మనుజుఁడు నీమెట్టుజేరునుపాయమును వెదకుకొనఁదగును.

శా॥ భూముఖ్యంబులఁ బంచభూతములనౌ మూర్తింగనంజాలుకన్
నీమూర్తింగనుటెట్లు దివ్యమును దండ్రీ! దివ్యమౌనీంద్రులే
లోమైజ్ఞానమయమ్ము నేత్రమున నాలోచించకన్గొందురు దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥భూముఖ్యంబులన్-పంచభూతములన్ - ఔమూర్తిన్ - కనన్-చాలుకన్ - నీమూర్తిన్ - కనుట - ఎట్లు - దివ్యమున్ - ఉ - తండ్రీ!-దివ్యమౌనీంద్రులు-ఏ-లోమై - జ్ఞానమయమ్ము - నేత్రమునన్-ఆలోచించి-కన్గొందురు - దుర్గా!

ప॥ భూముఖ్యంబులన్ = భూమి మొదలయిన, పంచభూతములన్= ఉదకము = అగ్ని. వాయువు. ఆకాశము. అను పేర్లుగల మహాభూతములనుండి. ఔమూర్తిన్ = ఉగునట్టి యాకారమును, కనన్=చూచుటకు. చాలుకన్= తగినకన్ను. దివ్యమును = అఖండతేజ స్స్వరూపమయిన. నీమూర్తిన్ = నీయాకార విశేషమును, కనుట = చూచుట, ఎట్లు = ఏవిధము, దివ్యమౌనీంద్రులే = సనకసనందాదులే, లోమై = అంతర్ముఖమునందలి, జ్ఞానమయమ్ము=జ్ఞానరూపమయిన నేత్రమునన్ = కంటితో, ఆలోచించి = విమర్శించి, కన్గొంద్రు = చూచుచుందురు.

భూమి, ఉదకము, అగ్ని వాయువు, ఆకాశము నను పేర్లు కలపంచ మహాభూతములయందు. సత్తాత్మకమయి తెంపులేక నిండియున్న నీ స్వరూపమును చర్మచక్షువులు కనొనఁ జాలవు. విమర్శనాత్మకమయిన జ్ఞాననేత్రముచే సనకసనందనాదులు సర్వకాలమును తనివిదీఱ సందర్శించుచు నిత్యానంద సముద్రవీచులను తూగు టూయెలలందు హాయిగా నూగుచుందురు

శా॥ నేమస్మిన్ వపుష స్సతీహృది ఫణీ నేతానిశశ్శేఖరే
భీమం యస్య పురత్రయపరిహరణం భిల్లోఽస్త్రదానేచ యో
నౌమిస్వాత్మని మల్లికార్జునమహంత మ్మందురి జేజేలు దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా। హారహీరాకృతీ।

ప॥ నేమస్మిన్ -వపుషః - సతీ - హృది - ఫణీ - నేతా - నిశః - శేఖరే - భీమం - యస్య - పురత్రయ పరిహారణం - భిల్లః- అస్త్రదానే- చ - యః - నౌమి - స్వాత్మని - మల్లికార్జునం - అహం - తం - అందురి - జేజేలు - దుర్గా - మల్లేశ్వర -

ప్ర॥ వపుషః = శరీరముయొక్క, నేమస్మిన్=సగపాలువందు,సతీ = స్త్రీరూపును, హృది = వక్షమందు, ఫణీ = సర్పము, శేఖరే = తలయందు, నిశః = రాత్రియొక్క, నేతా = నాయకుఁడైన చందురుఁడు, కలుగునో, యస్య = ఎవనియొక్క, పురత్రియ పరిహారణం = త్రిపురాసుర సంహారము, భీమం= భయంకరమైనదో, యః= ఎవఁడు. అస్త్రదానేచ = అర్జునునకు పాశుపతాస్త్రమిచ్చునపుడును, భిల్లః = బోయవాఁడయ్యెనో, తం = అటువంటి, మల్లికార్జునం = దుర్గామల్లేశ్వరుని, స్వాత్మని = నాహృదయమందు, నౌమి = నమస్కరించుచున్నానని, జేజేలు = దేవతలు, అంద్రు = పల్కుదురు.

అర్ధనారీశ్వరుఁడును, సర్పహారుఁడును, బాలచంద్ర ధరుండును, త్రిపురాసుర సంహారకర్తయును (ఇంద్రకీలాద్రి యందర్జునునకు పాశుపతాస్త్ర ప్రదాతయునగు") "దుర్గామల్లేశ్వరుని" నా హృదయమందు సేవింతునని ప్రత్యేకముగా నెవ్వరికివారు దేవతలందఱును కొలుచుచుందురు.

శా॥ ప్రామంజేయవె బత్తి నీపయిని బాబా పత్త్రిరింబూల నే
నీమైజల్లెద నిల్కడన్నిలుపవే నెమ్మిన్ సతంబున్ మదిన్
నీముందే నెలకొందునంచు గొలుతు ర్నిన్నాంధ్రులాసక్తి దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ ప్రామన్ - చేయవు - ఎ - బత్తిన్ - నీపయిన్ - ఇ - బాబా - పత్త్రిరిన్ - పూలన్ - నేన్ - నీమైన్ - చల్లెదన్ - నిల్కడన్ - నిలుపవు - ఏ - నెమ్మిన్ - సతంబున్ - మదిన్ - నీముందు - ఏ - నెలకొందున్ - అంచున్ - కొలుతురు - నిన్ను - ఆంధ్రులు - ఆసక్తిన్

ప్ర॥ బాబా! = ఓతండ్రీ!, నీపయిన్ — నీమీద, బత్తిన్ = భక్తిని, ప్రామన్ = వ్యాపించునట్లుగా, చేయవె = చేయుమని ప్రార్థన, పత్త్రిరిన్ = మారేడుదళములు మొదలైనపత్రిని, పూలన్ = తమ్మి మొదలయిన పూవులను, నేన్ = నీపాదభక్తుడనయిన నేను, చల్లెదన్ = ప్రసరింపం జేసెదను, సతంబున్ = సర్వకాల సర్వావస్థలయందును, మదిన్ = నామనస్సును, నిల్కడన్ = నిశ్చలత్వమునందు, నెమ్మిన్ = వాత్సల్యముచే, నిలుపవే = ఉండునట్లు చేయుము. నీముందే = నీసమక్షమునందే, నెలకొందున్ = పాయకుండెదను, అంచున్ = అనుచు, ఆసక్తిన్ = మిక్కిలిశ్రద్ధతో, ఆంధ్రులు = ఆంధ్రదేశస్థులు, కొలుతురు = సేవించుదురు.

బాబూ! భక్తిచే నీమీద మారేడుదళములు, మల్లెపూలు, చల్లెదను. సర్వదా నాకు నిలుకడ నెలకొల్పుము. మీ ముందట చలింపకుందునని యాంధ్రులు శ్రద్ధతో సేవించుచుందురు.

శా॥ లేమిం బాపఁగదమ్మ తల్లి గుణమల్లీసూనసౌగంధ్య స
ర్వామోదప్రద పాదపద్మ నవరత్నామేయ కాంతిస్ఫుర
చ్ఛ్రీమాహేంద్ర ధనుస్స్మృతిప్రద సురశ్రేణీ కిరీటౌఘ దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ లేమిన్-పాపన్-కద-అమ్మా-తల్లీ!-గుణమల్లీ-సూనసౌగంధ్య సర్వామోద ప్రద-పాద పద్మ నవరత్నా మేయ కాంతి స్ఫుర-శ్రీ మాహేంద్ర ధనుస్స్మృతి ప్రదసుర శ్రేణీకిరీటౌఘ - దుర్గా!-మల్లేశ్వర సర్వ దేవ పరివారా!- హారహీరాకృతీ!

ప్ర॥ మల్లేశ్వర..పరివారా! మల్లేశ్వర=మల్లేశ్వరుఁడు, సర్వదేవ=వినాయకాది సర్వదేవతలు, పరివారా = పరివారముగా గల తల్లీ!, హార... కృతీ, హార = హారములయందు, హీర = వజ్రరూపమయిన కొలికిపూసవలెను ప్రకాశించు, ఆకృతీ = ఆకారముగల తల్లీ! దుర్గా= దుర్గాంబికా! గుణ... ప్రద, గుణ = సత్యదయాదులయిన గుణములను, మల్లీసూన = మల్లెపూవుల యొక్క, సౌగంధ్య = పరిమళముచే, సర్వ = ఎల్లజీవులకు, ఆమోద = మిక్కిలి సంతోషమును, ప్రద=ఇచ్చుజననీ! పాద..............కిరీటౌఘ!, పాదపద్మ = పద్మముల వంటి పాదముల యందు, నవ = నూతనములయిన (లేక) తొమ్మిది విధములయిన, రత్న = రతనముల యొక్క, అమేయ = పోలికలేని, కాంతి = నిగ్గుల యొక్క, స్ఫుర = స్ఫురణములయందును, శ్రీ= కాంతులయందును, మాహేంద్రధనుః = ఇంద్రధనుస్సును, స్మృతి= తలఁపును, ప్రద=కలిగించు, సురశ్రేణీ=దేవతా సమూహముయొక్క, కిరీట = మకుటములయొక్క, ఓఘ = సమూహము కల, తల్లి=తల్లీ! లేమిన్ = వేదశాస్త్రముల యందును, నీమూర్తియందును ప్రాణులకు గలుగు అభావబుద్ధిని, పాపఁగదమ్మ = తొలఁగింపుమని ప్రార్థించుచుంటినమ్మా!

గుణములను మల్లెపూవుల పరిమళముచే నెల్లయెడల నానందము గలిగించుచు దామర పూవులవంటి పాదములయందు సాష్టాంగ నమస్కారమొనర్ప వ్రాలిన దేవతల కిరీటముల యందలి వజ్ర, వైడూర్య, మాణిక్య, గోమేధిక, మరకత, ప్రవాళేంద్రనీలాదిమణుల యొక్క కాంతులు, నీ దయావర్షము సూచించుటకయిన యింద్ర ధనుస్స్ఫురణమున కగుచున్నవి. తల్లీ! నీవు లేదనివాదించు నాస్తికుల దుర్వాదములను నశింపఁజేయుము.

శా॥ లేమింబాపఁగదయ్యా తండ్రి! గుణలాలిత్యాత్మసాహిత్య వి
ద్యా మాధుర్య మధుద్రవోపహితహృద్యద్దివ్య సంగీత గో
ష్ఠీ మాంజిష్ఠ నిధీశ సౌహృదకలాచ్ఛిన్నాయసంఛన్న దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ లేమిన్ - పాపన్ - కద - అయ్య - తండ్రి - గుణలాలిత్యాత్మ సాహిత్యవిద్యామాధుర్యమధుద్రవోపహితహృద్యద్దివ్య సంగీతగోష్ఠీ మాంజిష్ఠ-నిధీశసౌహృదకలా-అచ్ఛిన్నా - అసంఛన్న - దుర్గామల్లేశ్వర -

ప్ర॥ గుణ......మాంజిష్ఠ, గుణ = గ్రహణ ప్రబోధములు మొదలయిన గుణములయొక్క; లాలిత్య = మనోహరత్వమే, ఆత్మ = స్వరూపముగాగల, సాహిత్య = సర్వశాస్త్రసమ్మేళనముకల, విద్యా = జ్ఞానముయొక్క, మాధుర్య = రుచి యనెడు, మధుద్రవ = మకరందముతో, ఉపహిత = కూడుకొనియుండుటచే, హృద్యత్ = వినుచుండగనే కరగించుస్వభావముకల, దివ్య = మానవుల కలభ్యమైన స్థాయిగల, సంగీత = గానముయొక్క, గోష్ఠీమాంజిష్ఠ = శ్రేష్ఠమయిన కచ్చేరీలుగల తండ్రీ! నిధీశ......చ్ఛిన్నా! నిధీశ = కుబేరునియొక్క, సౌహృదకలా = స్నేహవిశేషముతో, అచ్ఛిన్నా = తెంపులేనివాఁడా! అసంఛన్న = ఇంద్రియ కోశగుణత్రయాదులయం దుండియు, వానితో బద్ధత్వములేనితండ్రీ!, దుర్గామల్లేశ్వర! = కనకదుర్గాదేవితో ప్రకాశించుదేవా! లేమిన్ = వేదశాస్త్రములయందును, నీమూర్తియందును ప్రాణులకుగల నాస్తికత్వమందయిన బుద్ధిని, పాపఁగదయ్యా = తొలగింపుమని ప్రార్థించుచున్నానయ్యా!

ప్రసాదము మొదలయిన గుణములచే సుందరములయిన యభిప్రాయములగల సాహిత్యమును విద్యలయొక్క యింపుదనమను మకరందముతోఁ గూడియుండుటచే నెల్లయెడల రంజింపఁగల దేవగానము కచేరీలతో నానంద మనుభవించుచు నవనిధులుగల యక్షేశ్వరునితోఁ దెంపులేని చెలి కాంముగల తండ్రీ! లోకముయొక్క నాస్తికత్వమును పోగొట్టుము.

శా॥ నా మొఱ్ఱన్వినుమమ్మ తల్లి! నిజకంఠ ప్రోత్థసప్తస్వర
గ్రామప్రస్ఫుటమూర్ఛనా గతిలయగ్రాహిస్వమాణిక్య వీ
ణా మోఘస్వరమాధురీచలదనంతానంతతానాంత దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ నా మొఱ్ఱ - వినుము - అమ్మ - తల్లి - నిజకంఠప్రోత్థసప్త స్వరగ్రామప్రస్ఫుటమూర్ఛనాగతిలయ గ్రాహిస్వమాణిక్యవీణా - మోఘ స్వరమాధురీచలదనంతానంతతానాంత - దుర్గా - మల్లేశ్వర - సర్వదేవపరివారా - హారహీరాకృతీ -

ప్ర॥ నిజకంఠ......................తానాంత, నిజ = స్వకీయమైన, కంఠ=కంఠము నుండి, ప్రోత్థ= బయలుపడెడు, సప్త = ఏడయిన, స్వర= స - రి - గ - మ - ప - ధ - ని - యను సంజ్ఞలుగల స్వరములయొక్క, గ్రామ = సమూహము, ప్రస్ఫుట = ప్రకటమైన, మూర్ఛనా = మూర్ఛనలను, గతి = తాళములయొక్క నడకల వైచిత్ర్యలను, లయ=రాగ తాళములయొక్క సమత్వమును, గ్రాహి = గ్రహింపజాలిన, స్వ = తనదైన, మాణిక్యవీణా = మాణిక్యమణి వికారమయిన వీణయొక్క, అమోఘ = తెంపులేని, స్వర = శబ్దధ్వనియొక్క, మాధురీ = మనోహర మగునరుచిచేత, చలత్ = స్ఫురించుచున్న, అనంత = అమితములైన, అనంత = అనంతయను సంజ్ఞావిశేషముతో నొప్పుచుండు, తాన = పదు నాల్గుభువనముల మహానంద సముద్రమందలి యలలపేరియుర్మ్యేలలందు నూగించు, స్వరవిశ్లేషము, అంత=హద్దుగల దుర్గా, = కనకదుర్గాదేవీ, నా మొఱ్ఱ= నామనవిని, తల్లి=తల్లీ, వినుమమ్మ = వినుమని ప్రార్థించుచున్నాను.

నీకంఠమునుండి బయలువెడలు స. రి. గ. మ. ప. ధ. ని అను స్వర సమూహమును ప్రస్ఫుటముగా మూర్ఛనలచేత గతి. గమక. లయాదులచేత గ్రహించు నీచేతివీణయందు తెంపులేని ధ్వని, మాధుర్యము, అనంత, తానం అను నమృతశబ్దములచే సర్వప్రపంచమానందపఱచుతల్లీ, నామనవి వినుమా.

శా॥ నామొఱ్ఱన్వినుమయ్య తండ్రి! భువనానందాను సంధాన వా
వా మోచాఫలశర్కరా మధురసా స్వాదప్రతుష్టామర
స్వామిధ్యేయపదారవిందయుగ సేవానమ్రనందీశ దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా! హారహీరాకృతీ!

ప॥ నా మొఱ్ఱ — వినుము — అయ్యా! — తండ్రి! — భువనానందాను సంధాన వాచా మోచా ఫలశర్కరా మధుర సాస్వాద ప్రతుష్టామరస్వామి ధ్యేయ పదార విందయుగ సేవానమ్ర నందీశ! —

ప్ర॥ భువనా..................నందీశ! భువన = పదునాలుగు లోకములకు, ఆనంద = ఆనందమును, అను సంధాన = కూర్పఁజాలిన, వాచా = వాక్కులవలన నగు, మోచాఫల = చక్రకేళి యరఁటి పండ్లయొక్కయు, శర్కరా = పంచదారయొక్కయు, మధురస = తియ్యందనము యొక్క, అస్వాద = అనుభవము యొక్క రుచిచేత, ప్రతుష్ట = మిక్కిలి సంతోష పెట్టబడిన, అమర = దేవతలయొక్క, స్వామి = గురువయిన బృహస్పతి చేత, ధ్యేయ = కొనియాడఁదగిన, పద = పాదములనెడు, అరవింద = పద్మములయొక్క, యుగ = జంటయందు, సేవా = సేవించుట కొఱకు, నమ్ర = వంగి విధేయత్వమును జూపుచున్న, నందీశ = వృషభేశ్వరుఁడు కలతండ్రీ! నా మొఱ్ఱ = నామనవిని, వినుమయ్య = వినుమని ప్రార్థించుచున్నాడను.

అరటిపండ్లు పంచదార మాధురీయలతో సమానమై, పదునాలుగు భువనముల కానందముఁ గలిగింపఁ జాలిన పల్కుబడితో బృహస్పతిని సంతోష పఱచుచు, ధ్యానించుచు మీ పాద పద్మముల సేవించుటకు నందీశ్వరుఁడు సర్వదా వంగియుండును.

శా॥ నీమాహాత్మ్యమెఱుంగ శక్యమె సదానిద్రాళుకుక్షింభర
వ్యామోహాంధ నిరర్థమత్తఖల దుర్వ్యాసంగ గర్విష్ఠ చిం
తామగ్నాధమ నాస్తిక ప్రతతికిన్ దారాపతిస్తుత్య దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ నీ మాహాత్మ్యము - ఎఱుంగన్ - శక్యము - ఎ - సదానిద్రాళుకుక్షింభర వ్యామోహాంధ నిరర్థమత్తఖల దుర్వ్యాసంగ గర్విష్ఠచింతామగ్నాధమ నాస్తిక ప్రతతికిన్ - తారాపతిస్తుత్య- దుర్గా!- మల్లేశ్వర!- సర్వదేవ పరివారా!- హారహీరాకృతి!-

ప్ర॥ సదా..................ప్రతతికిన్; సదా = ఎల్లవేళలయందు, నిద్రాళు = (సర్పములవలె) నిద్రించు స్వభావము కలవారును, కుక్షింభర = (కాకివలెను) పొట్టబోసికొను వారును, వ్యామోహా=నిత్యము కాని దానిని నిత్యమనుకొను భ్రాంతిచేత, అంధ = కనుగానని వారును, నిరర్థ = పనుల యందు ప్రాల్మాలిక గలవారును, మత్త = (ఏనుగువలె) మదించినవారును, ఖల = (పులులు మొదలైన దుష్ట జంతువుల వలె)హింసించుటకు వెనుదీయని వారును, దుర్వ్యాసంగ = (దుష్ట చతుష్టయమువలె) దురాలోచన మొనర్చు వారును, గర్విష్ఠ= తనకంటె గొప్పవారు లేరని విఱ్ఱవీగు వారును, చింతామగ్న = విచార సముద్రమున మునింగియుండు వారును, అధమ = పతితులై పనికిమాలిన వారుననగు, నాస్తిక ప్రతతికిన్, నాస్తిక=ఏమియు లేదని శూన్యవాదమును జేయు, ప్రతతికిన్ = సమూహమునకు, నీమాహాత్మ్యము= నీయొక్క గొప్పతనము, ఎఱుంగన్ = తెలిసికొనుటకు, శక్యమె=వీలగునా?

పాములవలె నెల్లప్పుడు నిదురించు వారును, కాకివలెఁ దమపొట్ట మాత్రమే నింపుకొను వారును, మిక్కిలి మోహముచే గాననివారును, పనికిమాలిన వారును, మదించినవారును, పెంకెతనము కలవారును, దురాలోచన కలవారును, గర్వముకలవారును, విచార సముద్రములో మునిఁగియుండు వారును, నీచులును, నీవులేవను వారును, మీ మహత్తును తెలియజాలరు.

శా॥ నీమాహాత్మ్య మెఱుంగశక్యము సదానిర్ణిద్ర నిస్తంద్ర దీ
క్షామేధా మహితాశయ ప్రముదితస్వాంతప్రబోధోదయా
వ్యామోహాత్మ దయావిధేయులకు విద్యాశౌర్యధౌరేయ దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా' హారహీరాకృతీ!

ప॥ నీమాహాత్మ్యము - ఎఱుంగశక్యము - సదా, నిర్ణిద్రనిస్తంద్రదీక్షా మేధామహితాశయ ప్రముదిత స్వాంతప్రబోధోదయావ్యామోహాత్మ దయావిధేయులకును - విద్యాశౌర్య - ధౌరేయ-

ప్ర॥ విద్యాశౌర్యధౌరేయ, విద్యా = జ్ఞానము యొక్కయు, శౌర్య = శూరత్వముయొక్కయు, ధౌరేయ = భారము నిర్వహించుతల్లీ, తండ్రీ, సదా= ఎల్లప్పుడు, నిర్ణిద్ర........విధేయులకును, నిర్ణిద్ర= మేల్కొనియుండు వారికిని, నిస్తంద్ర = తొందరలేని వారికిని, దీక్షా = కార్యనిర్వహణము చేతను, మేధా=బుద్ధివిశేషము చేతను,మహిత=గొప్పదైన,ఆశయ=అభిప్రాయములచేతను, ప్రముదిత=మిక్కిలి సంతోషపడు,స్వాంత=హృదయముకలవారికిని; ప్రబోధ= జ్ఞానప్రబోధముయొక్కయు, ఉదయ= పుట్టుకచేత, అవ్యామోహ= అజ్ఞానములేని, ఆత్మ=హృదయముకల వారికిని, దయా=కనికరమునకు, విధేయులకును = వశులగు వారికిని, నీమాహాత్మ్యము = నీగొప్ప, ఎఱుగను = తెలియుటకు, శక్యము = వీలగును,

ఎల్లప్పును సూర్యునివలె మేల్కొలుపువారును, దీక్షయందు పట్టుగల వారును, గొప్పభావములుగలవారును, తొట్రుపాటులేనివారును, నిత్యానందముకలవారును, జ్ఞానవిశేషముచే నశించిన యజ్ఞానము కలవారును, భూతదయకు లోఁబడువారును, నీమహత్త్వ మెఱుంగఁగలరు.

శా॥ నామీదన్నెనరుంపుమమ్మ సమఖండప్రాజ్యసామ్రాజ్య శా
స్త్రామేయ ప్రతిభాస్ఫురాసుకవితా సామ్రాజ్య సంపత్ప్రదా
నామోఘాశయహృత్కుశేశయదయా న్యాసా। మహోల్లాస దు
ర్గామల్లేశ్వర సర్వదేవపరివారా। హారహీరాకృతీ।

ప॥ నామీదన్ - నెనరు - ఉంపుము - అమ్మ - సమఖండప్రాజ్య సామ్రాజ్యశాస్త్రామేయ ప్రతిభాస్ఫురాసు। వితా సామ్రాజ్య సంపత్ప్రదా నామోఘాశయహృత్కుశేశయ దయాన్యాసా,- మహోల్లాస - దుర్గా,- మల్లేశ్వర-

ప్ర॥ సమఖండ............న్యాసా సమఖండ, తెంపులేనిదియు, ప్రాజ్య = ప్రశస్తమయినదియునగు, సామ్రాజ్య = సార్వభౌమపదవిని, శాస్త్ర = సర్వశాస్త్రములయందు, అమేయ = పోల్కిలేని, ప్రతిభా = అప్పటికప్పుడు స్ఫురణలుకల బుద్ధివిశేషముయొక్క, స్ఫురా= తోచుటలతో నొప్పు,సుకవితా=మంచిలక్షణములుకల, కవితా= కవిత్వమును, సామ్రాజ్య= సార్వభౌమపదవి యును, సంపత్ = సంపదలను, ప్రదాన=ఇచ్చుటయందు। అమోఘ= తెంపుగల,ఆశయ= అభిప్రాయముగల, హృత్కుశేశయ = పద్మము వంటిహృదయమునందు, దయా=కనికరముయొక్క, న్యాసా= నిక్షేపముకల దానా!, మహోల్లాస= గొప్పసంతోషముకలతల్లీ!, నామీదన్ = నాయందు, నెనరు = కనికరమును, ఉంపుమమ్మ= ప్రకటింపుమని ప్రార్థించుచున్నాడు.

చతుస్సముద్రముల మధ్యనున్న భూమండలమేలగలిగి, పూజ్యమైన మహాసామ్రాజ్యమును షట్శాస్త్రజ్ఞాన విశేషముగల నవనవోన్మేషబుద్ధిబలముచే స్ఫురించుకవితా సామ్రాజ్యమును సర్వసంపదల ననుగ్రహించుటయం దభిప్రాయముగల పద్మమువంటి హృదయమందు దయానిక్షేపముకల తల్లీ మహాసంతోషముకల జననీ! నామీద వాత్సల్యమును జూపింపుము.

శా॥ నామీదన్నెనరుంపుమయ్య! శివ! యన్న ప్రాణ చిత్తాది మూ
ర్తామూర్తాంతర పంచకోశవిషయోపాత్తేశ జీవత్వ స
త్తామాత్రాత్మ సుఖానుభూతి విలసద్ధన్యత్వ సంపన్న దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ నామీదన్ - నెనరు - ఉంపుము - అయ్యా! - శివ - అన్నప్రాణ చిత్తాదిమూర్తా మూర్తాంతర పంచకోశ విషయోపాత్తేశ జీవత్వ - సత్తామాత్రాత్మ సుఖానుభూతి విలసద్ధన్యత్వ సంపన్న - దుర్గామల్లేశ్వరా!

ప్ర॥ అన్న..................జీవత్వ! అన్న = అన్నమయము, ప్రాణ = ప్రాణమయము, చిత్త = మనోమయము, ఆది = మొదలయినవియు, మూర్త = కనిపించునవియు, అమూర్త = ఆకారము లేనివియు (కన్పింపనివియు), అంతర = లోంచెము కొఱ్ఱుంగజ పోటంటి వ్యవధానము కలవియునగు, పంచకోశ = ఐదు కోశముల వలననగు, విషయ = శబ్ద స్పర్శ రూప రస గంధముల చేత, ఆనందము చేత, ఉపాత్త = పొందఁబడిన, ఈశజీవత్వ = ఈశ్వరత్వ జీవత్వములు కలదేవా! శివ = శుభములను కలిగించువాఁడా! సత్తా..................సంపన్న, సత్తామాత్ర = ఉనికిచేత, ఆత్మసుఖ = దేశకాలాదులచే ఖండితము గాని యాత్మసుఖము యొక్క, అనుభూతి = అనుభవముచేత, విలసత్ = ప్రకాశించుచున్న, ధన్యత్వ = కృతార్థత్వముతో, సంపన్న = కూడినవాఁడా! నామీదన్ = నాయందు, నెనరు = కనికరమును, ఉంపుమయ్యా = ప్రకటింపుమని ప్రార్థించువాఁడ.

అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ యానందమయము లను పేర్లుకలిగి, కన్పడునవియు కన్పడనివియునగు పంచకోశముల సంబంధము గలుగుటచే పొందఁబడిన జీవత్వము కలవాఁడా! ఉండుటయను స్వరూపముతో నిత్యానంద మనుభవించుచు సర్వత్ర ప్రకాశించును దుఃఖము లేనివాఁడనయుతినను ధన్యవాదములతోఁ గూడినవాఁడా! శుభములు కలిగించువాఁడా నాయందు వాత్సల్యముంచుము.

శా॥ శ్యామ శ్రీభ్రమరాంబ! గౌరి! శివ! కూష్మాండేశ్వరీ! చంద్రఘం
టా! మాహేశ్వరి! సిద్ధిదాత్రి! యుమ! కాత్యాయన్యభిఖ్యాంబ! లీ
లా మాధ్వీక! మహాసరస్వతి! మహాలక్ష్మి! మహాకాళి! దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ శ్యామశ్రీభ్రమరాంబ - గౌరి - శివ - కూష్మాండేశ్వరీ - చంద్రఘంటా - మాహేశ్వరి - సిద్ధిదాత్రి - ఉమ - కాత్యాయన్యభిఖ్యాంబ - లీలామాధ్వీక - మహాసరస్వతి - మహాలక్ష్మి - మహాకాళి-

ప్ర॥ శ్యామ...రాంబ, శ్యామశ్రీ=నల్లని శరీరచ్ఛాయగల; భ్రమరాంబ= భ్రమరాంబికాస్వరూపా, గౌరి=బంగారుచాయగలతల్లీ! శివ=మంగళస్వరూపా, కూష్మాండేశ్వరీ = కూష్మాండేశ్వరీ సమాహ్వయా, చంద్రఘంటా=చంద్రఘంటాదేవీ స్వరూపా!, మాహేశ్వరి = పదునాల్గు భువనములను పాలించు తల్లీ! సిద్ధిదాత్రి! = సిద్ధిదాత్రియను దేవీస్వరూపమయిన తల్లీ! ఉమ = ఉమానామధారిణీ! కాత్యాయన్యభిఖ్యాంబ = కాత్యాయనియను పేరుగల తల్లీ!, లీలామాధ్వీక = విలాసములయందు రుచిగలతల్లీ!, మహాసరస్వతీ!, మహాలక్ష్మీ!, మహాకాళీ!, (సృష్టిస్థితిలయములొనర్చుతల్లీ! (మొ॥ కర్తాదను,)

నీలమేఘశ్యామల మయిన శరీరచ్ఛాయగల శ్రీశైలభ్రమరాంబవు. పచ్చనిశరీరముగల గౌరివి మంగళముల నొసంగుదానవు కూష్మాండేశ్వరివి. చంద్రఘంటాదేవివి సిద్ధిదాత్రివి, ఉమవు. మోక్షమున కన్యస్థానము లని విఖ్యాయిం మ కత్యాయనుని నుద్ధరించిన కాత్యాయనివి; విలాసముల రుచి తెలిసినదానవు మహాసరస్వతివి. మహాలక్ష్మివి. మహాకాళివి. ఇవియనవేలా అన్నిశక్తులును నీవేయైయున్నావు.

శా॥ భ్రూమధ్యస్థ! చరాచరస్థ! భవ! శంభూ! స్తంభితేంద్రావలే
పా! చాపాయితమేరుభూమిధర! యష్టైశ్వర్య! దివ్యోదయా!
ప్రామాణ్యైక సులభ్య! భక్తజనతా వాసాగ్రమందార దు
ర్గామల్లేశ్వర సర్వదేవ పరివారా! హారహీరాకృతీ!

ప॥ భ్రూమధ్యస్థ - చరాచరస్థ - భవ - శంభూ - స్తంభితేంద్రావలేపా - చాపాయిత మేరుభూమిధర - అష్టైశ్వర్య - దివ్యోదయా - ప్రామాణ్యైక సులభ్య - భక్తజనతా వాసాగ్రమందార -

ప్ర॥ భ్రూమధ్యస్థ, భ్రూ = కనుబొమల యొక్క, మధ్య = మధ్య భాగమునందు, స్థ = నివసించువాడా! చరాచరస్థ, చరాచర = స్థావర జంగమాత్మకమయిన సర్వ ప్రపంచమందు, స్థ = నిలిచినవాడా!, భవ = కర్తృ స్వరూపమును సర్వకాల సర్వావస్థలను నిలకొనువాడా! శంభూ! = లోకములకు మేలు కలిగించువాడా! స్తంభితేంద్రావలేపా, స్తంభిత = వ్యర్థముగాఁ జేయఁబడిన, ఇంద్ర = ఇంద్రుని యొక్క, అవలేపా! = గర్వము కలవాఁడా!, చాపాయిత మేరుభూమిధర, చాపాయిత = ధనుస్సుగాఁ జేయఁబడిన, మేరుభూమిధర = బంగారుకొండ కలవాఁడా!, అష్టైశ్వర్య = అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వమును అను నెనిమిది సిద్ధులు కలవాఁడా! దివ్యోదయ = స్వయముగా జన్మించఁగల శక్తి కలవాఁడా!, ప్రామాణ్యైక సులభ్య = ప్రమాణబుద్ధి కలవారికే ముఖ్యముగా గోచరింపఁగలవాఁడా! భక్తజనతా వాసాగ్ర మందార, భక్తజనతా = భక్తసమూహము యొక్క, వాస = ఇంటి యొక్క, అగ్ర = ముంగిటి యందలి, మందార = కల్పవృక్షమా, దుర్గామల్లేశ్వర! = దుర్గామల్లేశ్వర స్వామి! నమస్కారము.

దహరాకాశమున నెలకొన్నావు. అంతటను కలుగుచున్నావు. శుభములకు స్థానమవు. వజ్రమెత్తి యింద్రుని గర్వమణంచితివి. మేరుధనుస్సు చేతియందుఁ గలదు. అణిమ. మహిమ. గరిమ. లఘిమ. ప్రాప్తి ప్రాకామ్యము. ఈశిత్వము. వశిత్వము అను నెనిమిది సిద్ధులు గలవు. ప్రమాణబుద్ధికి లభింతువు. భక్తుల యింటి ముంగిటి కల్పకమవు.

